# రాజ్యశ్రీ

చరిత్రాత్మకమగు నొక చక్కని నవల.



గ్రంథకర్త.

పండిత.

ఈ. భాష్యకాచార్యులు,

ప్రధానాంధ్రోపాధ్యాయులు.

శ్రీమహంతుగారి

దేవస్థానము హిందూ హైస్కూలు

తిరుపతి.



MADRAS
THE ARTISAN PRESS, WALLAJAH ROAD.

1926.

# విజ్ఞప్తి.

చరిత్రాత్మకమగు నీ నవలలో చాలభాగము కరుణారస ముట్టిపడునట్లుం డును. ఇతర రసములు నంగములుగా నందందును గలవు. కొన్నియెడల రెండేసి మూఁడేసి రసములు నొక్కటిగా గోచరించుచు; విచిత్ర వాసనా వాసిత మగు నానా సూన సంకలిత యద్భుత మాలిక చొప్పున చదువరుల మది కెంతయు వింతఁ గొల్పుచుండును. కరుణా రసము ప్రధానముగా నుండినను తక్కిన రసములుఁగల యెడల్ల నవియే ప్రధానములా యను సంశయమును పుట్టించుచుండును.

పండిత సమ్మేళన సమయమున కొంతవఱకు వివిధ మతముల గుఱించి చర్చింపఁబడియున్నది. ఏవ్య సూచనలోనను స్వప్న సందర్శనము నను గల భయానక రసము చదివియే గ్రహించి తీరవలసినది. ముఖ్యముగ రాజ్యశ్రీ మంగళికల ధైర్య సాహసములును మంగళికా చాతుర్యమును జయచంద్రుని దుస్తంత్రములును వర్ణనా తీతములు. కాంతమున సత్యమును జక్కఁ బడు నను టకు విభాకర మిత్రుని ప్రవర్తనమే ముఖ్యాదర్శము.

చరిత్రాంశమును మాత్రము వెల్లడి సేయుటయేకాక ఆ కాల పుటాచార ములను గూడ కొంతవఱకు విశద పఱచుచున్నది. స్థాలీపులాక న్యాయమున నిందలి విషయములనే నించుక యెత్తిగించితి నంతియకాని తక్కిన వానికిఁ జదువరులే ప్రమాణమగుదురు. వేయేల! ఈ గ్రంథమును జేత నెత్తికొనినఁ గడవఱకును జదువక విడరనుట యతిశయోక్తి కాఁజాలదని దీని నచ్చొత్తించు టకు మున్నే చదివిన యనేకుల మూలమున వినియుంటిని.

గ్రంథకర్త.

పండిత. ఈ. భాష్యకాచార్యులు,

ప్రధానాంధ్రోపాధ్యాయులు.

శ్రీమహంతు దేవస్థానము హిందూ హైస్కూలు,

6—11—1926. తిరుపతి.



శ్రీరస్తు

# రాజ్యశ్రీ

## మొదటివ ప్రకరణము.

### కాటసారి.

ఆహా! ఏమిదీ యన్యాయము! రాజవంశమునఁ బుట్టి ప్రజలఁ దనసుతులవలె రక్షింపఁదగియుండియు, ఈ నరపతి యిట్టి నీచమార్గమున నడుగిడఁ జూచుట పాడియా! ప్రభాకరవర్ధనుని మరణమును, రాజ్యవర్ధనుఁడు శత్రురాజులతో యుద్ధము సేయ వెడలుటయు విని, ఇదియే యదనని గృహవర్మపైఁ బడఁబూనుట యేటినీతిపద్ధతి? బలవంతుఁడు నడవవలసిన మార్గ మిదియగునా? శత్రువు నొచ్చియుండుటఁ జూచి యాతనిపైఁ బడనెంచుట యన్యాయము. అందును నిష్కారణముగ తటాలున రాజ్యమును ముట్టడింపనెంచుట మిక్కిలి యన్యాయము. చెంతనుండు మంత్రులైనను ఇది యనుచితమని వచింపక, ఆతని పోకడల ననుసరించుట యుక్తమగునా? ఇట్టి రాజునొద్ద ఏగాలికాచాప నెత్తెడివారు గాకున్న ఎట్టివారుండఁగలరు? ఇంతకు నీగృహవర్మ ఈతనికి లోఁబడువాఁడా! గృహవర్మ యెట్టివ్యసనమున నున్నను ఈతనికన్న మిన్నయే యగును. కావుననే కదా యీ నీచుఁ డిట్టియకార్యమునకుఁ గడఁగెను. ఎన్నిమాయోపాయము లాచరించినను ఈతనికి జయము లభించునా? సేన లెక్కువగా నున్నవని ఈతఁడు గర్వించెఁ గాఁబోలు! ఈతని బలగమునకన్న నినుమడుంగగు

బుద్ధిబలమును అంతకన్నను బదింతలధికమగు రాజ్యశ్రీదేవిగారి యాలోచనా బలమ్మును గలవు. ఈవిషయమును కొంచెమేని యాలోచింపక యూరక యిట్లు త్రుళ్లిపడుచున్నాఁడు, తనకును గృహవర్మకును అజగజాంతరము గలదనుట యెఱుఁగకున్నాఁడు.

అట్లని గెలుపు గృహవర్మకే కల్గునని దృఢముగఁ జెప్ప వీలులేదు కదా! ప్రత్యక్షయుద్ధమున నాతఁడు గెలువలేఁడు. కాఁబట్టియే మాళవేశుఁ డిట్లు మాయలు పన్ని సంహరింపఁదలఁచియున్నాఁడు, మనరాజునిప్పటితీరు చూడ ప్రత్యక్షముగ యుద్ధమున కుపక్రమించులాగున తోఁచుటలేదు. అట్టియెడనింక వంచనయేకదా శరణము! ఇట్లు మోసపుచ్చి అతనిని జంపిన యెడల అపకీర్తియే యాతఁడు పొందులాభము. ఒక్కచోఁగన్యాకుబ్జమబ్బునుగదాయని యెంచినను శాశ్వతమగు కీర్తినిచ్చి నశ్వరమగు నీరాజ్యము నిలుచుట యవివేకికృత్యము. ఔరా! రాజ్యలోభముకదా యింతటిపని కుపక్రమింపఁజేయుచున్నది. మృత్యువక్త్రమునుండి యైనఁదప్పించికొనవచ్చును గాని యాశావాగురలనుండి తొలఁగుట యరుదు. కావుననే మహాత్ములు దీని నిరాకరింతురు. అంటురోగపు క్రిములవలె ఇది యప్పటప్పటి కభివృద్ధమగుచుండును. ఈదురాశాపిశాచమును బాఱఁద్రోలుటకు వివేకమాత్రమొక్కటియే తగునది. శుష్కకాష్ఠము నగ్నివలె జ్ఞానశూన్యుని ఈలోభము నాశముగావించును. ఎట్టివంచనకయినను, ఎట్టిహత్యకయినను ఈలోభివెనుదీయఁడు. నలువురు నవ్వుదురని తలఁపఁడు. పెద్దలు దూషింతురని యోచఁడు.

అని తలంచుచు నొకనాటి తెల్లవాఱుజామున నొక పాంథుఁడు ఉజ్జయినీ ప్రాంతారణ్యమునఁ వెడలుచుండెను. ఆతరుణమున నీచుని, వానిపక్షమువారున విడుచునట్లు తారక లెల్ల దోషాకరుఁడగు నక్షత్రేశుని వీడిమఱుఁగు పడఁదొడఁగెను. కళానిధి యయ్యును గాలవశమునఁ జంద్రుఁడు కళాహీనుఁడాయెను. దుర్వర్తనుని యపరాధమున కుపితుఁడగు ధార్మికుని నేత్రమువలె పూర్వదిశ యరుణకాంతిసంయుతమాయెను. మాళవనాథుని దురుద్దేశము నెఱిఁగింప గృహవర్మ కడ కరుగు వార్తావహుఁడో యన చల్లనిగాలి వీచుచుండెను. దానికిఁదోడుగ దట్టముగా గురియుచుండిన మంచును తగులుచుండెను. కంబళికంచుకధారియయ్యు మనబాటసారి యాశీతబాధ కించుక కంపించియు, ధైర్యవంతుఁడగుటచే ఎట్లో యోర్చుకొని యాదారినడచుచు, ఇట్లని తలపోయఁదొడఁగెను.

"గ్రీష్మకాలమున నెంతయు నానందమొసఁగు నీ శీతవాతమిప్పుడు ఇంతబాధాకరమయ్యెఁగా! కాలమే దీనికిఁ గారణము. కాలమహిమ గొప్పదికాకున్న జ్ఞానశూన్యుఁడనై, దరిద్రబ్రాహ్మణుఁడనగు నేను గృహవర్మ మహారాజునకుపాయము నేర్పవెడలుట యెట్లు సంభవించును? ఇందునకుఁ గారణము సత్యవర్మయొక్క యాశ్రయమేకదా! ఔరా! అతని మహిమ [redacted]ని యాడుదును! దేవగుప్త మహారాజునకు నాతని పేరువినగుండె లదరుచుండును. అంతటివాఁడు గాకున్న నెచ్చటనో రహస్యాగారమున జరుగు నామంత్రాలోచనాతత్త్వము నెఱిఁగి నాకుం దెల్పి యిట్లుపంపఁజాలునా! ఇతఁడిట్టి శ్రమపుచ్చికొనినందున కిది నిర్విఘ్నముగఁ గొనసాగినచో మేలగును!

అదియసాధ్యమని తోఁచెడిని. ఎచ్చట నెట్టివిఘ్నము రానున్నదో యని నామానసము మిక్కిలి భీతిలుచున్నది. దీనికిఁ గారణము నామది నిత్యశంకియగుటయే. ప్రీతిగల యెడ నెల్లరకు నిట్లేయుండుట సహజము. "అతిస్నేహః పాపశంకీ" యనుట నిక్కువము."

అని యిటుఁ దలఁచుచు నీపథికుఁడు పోవుచుండెను. ఆ తరుణమున బాలసూర్యుఁ డరుణకాంతి యుక్తుఁడై యాకసమున దానాని పూవుంబోలెఁ దోఁచుచు గగన కుసుమమసత్యముకాదను భ్రాంతిని గలిగించుచుండెను. పక్షులుగూండ్లు వీడి ఆహారార్థ మచ్చటచ్చటికిఁ బోవనెంచుచు తామాచరింపవలసిన కార్యక్రమములఁగూర్చి అన్యోన్యసంభాషణములు సలుపుచున్నవో యనఁ గలకలారావములు కావించుచుండెను. మృగములును తమ పొదలనుండి వెడలనుంకించి తలలమాత్రము బయలువెట్టి ఎచ్చటనైన మనుష్య సంచారమున్నదాయని ఇటునటును బరికింపసాగెను. అచ్చటచ్చట ఆకులపైఁ బడియుండు హిమబిందువులు ముత్యముల విధమునఁ గాన్పించుచుండెను. ఇట్లెల్లెడల నుత్సాహదాయకమగు నాసమయము ఆప్రాంతమునఁగల దొంగలకుఁ గొండలకు మాత్రము అత్యంతదుఃఖావహమాయెను.

ఆ కాలమునఁ గొండలు చోరులు సాధవృత్తినై [illegible] యరణ్యమున నివాసములు గల్పించికొని రాత్రుల గ్రామముల పైఁబడి స్వేచ్ఛగా దోఁచికొనుచుండిరి. పగలంతయును ఆగాఢారణ్యమున నుండుచు బాటసరుగువారింబట్టి బాధించివారి సొమ్ములను హరించుచుండిరి. వీరొక శక్తి నారాధించుట

గలదు. వీరికా దేవతయందత్యంత భక్తివిశ్వాసములుగలవు. ఈచోరులాదేవికి నరబలు లొసంగుచుండుటచేతనే వారెవ్వరికిం జిక్కుటలేదని వారి విశ్వాసము. ఇట్టి నీచులకు చిమ్మచీఁకటులు గ్రమ్మియుండు నిశాసమయము దక్క పగటి పూఁట యెట్లు ఘటించును? ఏమియాశ్చర్యము! "అహింసాపరమో ధర్మః" అని యెల్లెడలం బర్వియుండు నీకాలమునఁ గూడ నిట్టి నీచకృత్యములు జరుగుచుండుటయా? ఏప్రాణికిని హింస కల్పింపఁగూడదని శ్రుతులు ఘోషించుచుండ వీరేలసరకు సేయకున్నారు? తోఁచిన పోకడలం బోవు నీచులు శాస్త్రములను, ఆచారములను బాటింతురా! ఇట్టివారికి నరకమన్న భయముండునా? వీరెట్టి యకార్యమునకును వెనుదీయరు. ఇంతటి క్రూరులగు నీచోరులాదేవియం దంతటిమూఢభక్తి కలిగియుండుట యెంతయు నచ్చెరువుగనున్నది. ఇదియేకదా తామసభక్తి!

ఆనాఁటి బాటసారు లొంటరిగా నాయడవి నేఁగుటకు భీతిలుచుండిరి. అట్టి తెరువున నిస్సహాయుఁడై యరుగుచుండు నీబాటసారియు మిక్కిలి భయపడుచుండెను. ఏమిచేయఁ గలఁడు. తాను పూనినపని యనివార్యమగునదిగానఁ జేయునది లేక యట్టె నడచిపోవుచు, "ఏ యాపదయులేక యీ యడవి దాఁటినచోఁ బూనినకార్యము నిర్విఘ్నమగు. అయ్యది యసాధ్యము. ఐనను, అర్థహీనునకుఁ జోరులవల్లని భయమేల? ఇంక నిట్టి శంకలు మాని మదిని బదిలపఱచికొని చనుట భావ్యము. త్యక్తశంక ముక్తధైర్యులకు సుఖదుఃఖములు నైజములు గాన, దీనతమాని ధీరతం బూనెదను." అని చింతించుచు నడచుచుండెను. సూర్యునికిరణములు నలుదెసలం

బర్వియున్నను చెట్లచేఁ గ్రిక్కిరిసియున్న యా కాంతార మధ్యమునఁ జీఁకటి క్రమ్మియుండెను. అప్పుడాతని వెనువైపున నడుగుల సవ్వడివినవచ్చి నటులుండెను. ప్రక్కననుండు పొదలో నేదియో గదలునటులుండెను. చెంత నెవ్వరో గుసగుసలాడు నటుల గోచరించెను. భీతుఁడై యాతఁడు వెనుదిరిగి చూచెను గాని యెవ్వరును గానరాకుండిరి. అంత నితఁడు తన శంకయే యందునకుఁ గారణమని తలఁచుచుఁ బామరుని పగిది నిట్లు భీతిసెందుట పాడిగాదని యెంచెను. భగవంతునిపై భారము వేసి యాతని నామ స్మరణము గావించుచుఁ బోవుచుండెను.

## రెండవ ప్రకరణము.

### కన్యాకుబ్జము.

---

శ్రీమంతంబై సకల సస్య పరిశోభితంబై, భూతల స్వర్గమో యనం దనరుచుం గన్యాకుబ్జనగర మెల్లరకు నుత్సాహదాయకమై వాసి గాంచుచుండెను. ఆ పట్టణము గంగాతీరమునం గట్టంబడియుండుట నచ్చటి వారెప్పుడును, నీటికఱవు నెఱుంగకుండిరి. దీని చుట్టును గొప్ప ప్రాకారమమరియుండెను. అందలి బురుజులు చాల నెత్తుగునవై; శత్రువులెవరేని ఆ కోట వెలుపలికివచ్చి నిలచిన లోనుండియే సైనికులు వారిపై బాణములు ప్రయోగింప ననువగునంత వైశాల్యము గల్గియుండెను. ఆ ప్రాకారముం జుట్టికొని యగాధమగునగడ్తయుండెను. అన్నగర రాజము వైశాల్యము పదిక్రోశముల పొడవు, నంతయె నిడివియుంగల్గియుండె. వీథులు విశాలములగుటచే నందఱు జనులు నడచుచుండినను ఎన్నిశకటములు వచ్చుచుండినను జనుల యాగమనప్రత్యాగమనముల కెట్టినిరోధమును గల్గకుండెను. వర్షాసమయమున వీథులంబడు వర్షజలమెల్ల బాటల కిరువంకలంగల కాల్వలలోంబడి ద్వారినడచువారికి ఎట్టికష్టమును గల్గించకుండెను. వీథులు రెండువేళలను శుభ్రపఱచుచుండుటచే, ఎట్టి చెత్తయును లేక శుద్ధమై గచ్చు నేలవలెం శో[illegible]చుండెను. ఎచ్చటిజను లచ్చటనే సామగ్రులం గొన ననువగునట్లు ప్రతివీథిని సుకాణములుగలవు. వీథి వీథి నొక్కొక్క యారక్షకభటాలయ ముండుటచేం జోరాదిబాధలు లేకుండెను. అచ్చటి యిండ్లిరుకులేక యతివిశాలములగు గవాక్షములచేనిండి చల్లని గాలి యరుదెంచుట కెంతయుననువై

యుండెను. ఒక్కదాని వెంబడి నొక్కటిగఁ గట్టఁబడక వెవ్వే ఱుగా నిర్మించియుండుటచే జనులయునికికి ఆగృహములు మిగుల నుపయుక్తములై యుండెను. ఆనగరమున నాకులమ్మువారు ముప్పది వేలుండిరి. పదివేల బౌద్ధభిక్షువులుండిరి. రెండు వందల కంటె నధికముగ హిందూ దేవాలయములుండెను. మఱియును ఎన్నియో యుపవనములును ఎన్నియో కొలఁకులు నుండుటచే నెప్పుడును వేఁడిమిచే బాధపడకయానగరవాసులు ఎల్లప్పుడును సుఖముగనుండిరి. ఇంకను దేశ దేశపదార్థ సంగ్రహాలయ ములు ననేకములుండెను.

ఆనగరపు టుద్యాన వనములు ఎంతయు మనోహర ములైయుండెడివి. సాయంసమయమున నాతోఁటల ననేకులు విహరించుచుందురు. అచ్చటి శీతవాతములు విహార శ్రాంతులగు యువకుల విశ్రాంతులఁ జేయుచుండును. ఆ పురమున మొలచిన తృణము మొదలు మహావృక్షమువఱకునుగల ఒక్కొక్క స్థావరప్రాణియు చక్కఁగా నభివృద్ధిచెంది యా భూమి సారవంతమనుటకు ముఖ్య నిదర్శనముగా నుండెడిది. ఇంక నాయూరం గొన్ని కళాశాల లేర్పడియుండెను. అందనేకులు జ్ఞానవంతులు బోధకులుగ నేర్పడియుండిరి. కళాశాలల ప్రాశస్త్యముంబట్టియు, బోధకుల సామర్థ్యవిభవముంబట్టియు నానాదేశములనుండి విద్యార్థు లనేకు లరుగుదెంచి విద్యాభ్యా సించుచుండిరి. అట్టి విద్యార్థుల కశనవసనాద్యనేక సౌకర్యముల నాయూరి ప్రజాప్రతినిధి సంఘమువారు కల్పించుచుండిరి. కర్మా గారములనేకము లుండుటచే చేతిపనులు నచట నభివృద్ధి చెందు చుండెను. అచ్చటి యారోగ్య శాఖాధికారులు జనుల యా

రోగ్యమున కెట్టియాటంకమును గల్గకుండు లాగున వేయికన్నులతో జూచుచుండిరి. ఈపట్టణముం జూచిన పరరాజులు సైతము "ఇచ్చటి మందిరములు నిశ్చలభక్తుని నమ్మికవలె దృఢములై చంద్రకాంతశిలలతో నిర్మింపఁబడినవి. వీని నిర్మాణమున కెన్నియో దీనారములు వెచ్చించి యుండవలయును. రెండు వందల సంవత్సరములు తదేకప్రయత్నముగానున్నఁ గాని ఇట్టి నగరము నిర్మించుట యసాధ్యము" అని పొగడుచుండిరి.

ఇట్లు సకల సుఖములకు నాటపట్టగు నా రాజధాని యనంత వైభవోపేతుండై మౌఖరీవంశజాతుఁడగు గృహవర్మ యొక్క పరిపాలనమున వాసిగాంచుచుండెను. ఆ రాజు రూపవంతుఁడును, విద్యావంతుఁడును, రాజనీతి నిపుణుఁడునై యుండెను. అతనిగుణగణములఁగాంచి సంతసించిన ప్రభాకరవర్ధనుఁడు తనతనయను రాజ్యశ్రీ నాతనికిచ్చి పరిణయము గావించెను. ఆమెయుఁ దన భర్తకు రాజ్యపరిపాలనాదికములందు ఎల్ల విధములఁ దోడ్పడుచుండెను. మహావీరులని ప్రసిద్ధిగాంచిన రాజ్యవర్ధన హర్షవర్ధనుల చెలియలగు నామెయు నిజ సోదరులవలెఁ బరాక్రమవంతురాలు. వీరవనితయగు నాసాధ్వీలలామ రాజ్యతంత్రముల నడపుటలో మిగులం బ్రవీణురాలు. గృహవర్మ మహారా జూర లేనప్పుడు స్వయముగ నామె యా రాజ్యమును పాలించుచుండును. ఆ దంపతులకు బౌద్ధమతమునందు ఎక్కుడుగ నభిరుచియుండెను, అయినను అన్యమతములందు ద్వేషభావములేక సర్వమత సమ్మతులై మెలఁగుచుండిరి. బౌద్ధ భిక్షువులకు విహారములు కట్టించిరి. హిందూ

దేవాలయములు అనేకములు అభివృద్ధిపఱచిరి. జైనుల నెందఱినో మిక్కిలి సన్మానించిరి. బ్రాహ్మణులఁ బెక్కుర ఎక్కుడు గౌరవించిరి. వీరిరాజ్యమున మతభేదములేక పండితులైనచో ఎల్లరును గౌరవార్హులగుదురు.

గృహవర్మయొక్క బాల్యమిత్రుఁడొకఁడు దివాకర మిత్రుఁడనువాఁడు బాల్యమునందే విరక్తిచెంది బౌద్ధసన్న్యాసియై వింధ్యారణ్య ప్రాంతమునకేఁగి యచ్చట నాశ్రమము కల్పించుకొనియుండెను. అతఁ డప్పుడప్పుడును దన మిత్రుఁడగు గృహవర్మమహారాజుం జూచుటకు వచ్చుటకలదు. దివాకర మిత్రుఁడు సాంసారికాపేక్షల నెల్లను మాని బంధవిముక్తుఁడయ్యెను, మిత్రుని తోడి స్నేహబంధమును మాత్రము వీడఁజాలకుండెను. రాజును దనమిత్రుఁడు వచ్చినపుడెల్ల, కేవల మైత్రిని బాటించి చనువును మాత్రమే చూపక భక్తిశ్రద్ధలును గల్గి యాతనిఁ బూజించుచుండెను.

కన్యాకుబ్జాధీశులగు మౌఖరీవంశజులకును మాళవ దేశాధీశ్వరులగు గుప్తరాజులకును, పెక్కుతరములనుండియు విరోధములు పెచ్చు పెరుఁగుచుండెడివి. కావుననే అప్పటి యుజ్జయినీ నాథుఁడగు దేవగుప్తుఁడు గృహవర్మపై నెంతయు నసూయగల్గియుండెను. దేవగుప్తుఁడు హూణరాజులతో స్నేహముసేయుచుండుటచే ఆ కాలపురాజు లనేకుల[redacted] యెడ వైషమ్యము వహించియుండిరి. మాళవాధీశుఁడును ఇట్లు తనపై ననేకులు విరోధముగల్గి వర్తించుటంబట్టియు; స్థానేశ్వర రాజపుత్రులును, రాజ్యశ్రీ సోదరులునగు రాజ్యవర్ధన హర్షవర్ధనులు బలవంతులగుటంబట్టియు, కన్యాకుబ్జాధీ

శ్వరునిపైఁ దనకెంతటి యసూయయున్నను వెలిబుచ్చక సమయము కొఱకు నిరీక్షించుచుండెను. వీరవనితయగు నా రాజ్యశ్రీ వలని భీతియు నాతనికెంతయో కలదు. ఆతని యౌదాసీన్యమున కదియు నొక ముఖ్యకారణము. చారముఖమున నప్పుడప్పుడిచ్చటి వార్తలం దెలిసికొనుచు, ఎప్పుడు సమయము దటస్థించునా యని యెదురుచూచుచుండెను. గృహవర్మ మహారాజునకు నీతని కాపట్య మెఱుకపడక యుండలేదు. అయినను దన దేహబలమును రాజ్యశ్రీదేవిగారి మంత్రబలమును నుండుటచే శత్రువును లక్ష్యము సేయకుండెను.

ఒకనాఁడు గృహవర్మ మహారాజు నిండు కొలువున నుండెను. రాజ్యశ్రీయును రాజు ప్రక్కన నొక యాసనమున నాసీనయై యుండెను. ఆ తరుణమున దివాకర మిత్రుఁడు దన శిష్యవర్గము తోడ నాసభా భవనమునకు వచ్చెను. రాజును వానిం బూజించి యుచితాసనాసీనుం గావించెను. దివాకర మిత్రుఁడును మిత్రుని మన్ననలచే మిక్కిలి తృప్తుఁడై యిట్లనెను.

దివా:—రాజేంద్రా! ఏమట్లు చిన్నఁబోయి యుంటివి?

గృహ:—ఆర్యా! మా బావ రాజ్యవర్ధనుఁడు హూణులతోఁ బోరనరిగెను. వాని క్షేమవార్త మాకింకను దెలియకుండుటయే యీ చింతకుఁ గారణము.

రాజ్యశ్రీ:—యతీంద్రా! మాయన్న యెచ్చట నుండునదియుం దెలియకున్నది. మీరలు సర్వత్ర సంచరించెడి వారలు గావున మీకాతని కుశలవార్త తెలిసి యుండినచో నానతిండు.

దివా:—తల్లీ! మహావీరుఁడగు నీ సోదరుని విషయమున నింత చింతయేల? ఎట్టి యుద్ధములైన నేమి

వాని కెన్నటికి నపజయము గల్గనేరదు. కావున మీ రిట్లు భయపడుట సరికాదు. అతఁ డిప్పుడు హూణులఁ బరాభవించి, జయలక్ష్మిం గ్రహించి కాశ్మీరమునం దున్నాఁడు. అచిర కాలముననే రాఁగలఁడు.

గృహ:—నేఁడీ శుభవార్త వినినందున కెంతయు సంతసించు చున్నాఁడను.

దివా:—ఈ సంతోషవార్త యటుండనిమ్ము. మాళవ రాజు నీపై దండెత్తి రాఁబోవునట్లు నాచెవి సోఁకినది. కాఁబట్టి ఆవిషయముననతి జాగరూకుఁడవై యుండుట భావ్యము. నా యీ రాకయు నీ కావిషయ మెఱిఁగించుటకే యగుచున్నది.

గృహ:—ఏమి! మాళవ నాథుఁడు నాపై దండెత్తి రాఁబోవు చున్నాఁడా! ఇది యగ్నిపై శలభ ముఱుకునటులకదా యున్నది!

దివా:—మిత్రమా! నీవట్లెంచుట కడుఁ బొరపాటు. చిన్న పామునైనను పెద్ద కఱ్ఱతోఁ గొట్టుట వాడియగును. వాఁడెట్టివాఁడైనను నీవుపేక్ష వహించుట యయుక్తము.

రాజ్యశ్రీ:—మునికుల తిలకా! హూణపక్షపాతి యగుట నెల్ల రాజులు నుపేక్షవహించియుండఁగ, మనపై నాతఁ డెటుల రాఁగలఁడు?

దివా:—తల్లీ! వంగ దేశాధీశుఁడగు శశాంక గుప్తుఁడు, అత నికిఁ దోడ్పడనున్నటుల వినుచున్నాను. జయించిన రాజ్యమును వారిద్దఱును సమముగాఁ బంచికొన వలసి నట్లొడంబడికలు గూడ జరిగినవఁట.

రాజ్యశ్రీ:—నాథా! మీరిఁక నాలసింపక వెంటనే కాశ్మీరము నకు భటుల నంపుఁడు.

గృహ:—ప్రియా! నీ కేటి కిట్టిభీతి? వీర పత్నివయ్యును స్త్రీల కు సహజమగు భీరుత్వమును వీడకున్నావు. శశాంక గుప్తునకును, అతనికిని, ఎన్నినాళ్లనుండియో వైరము పెచ్చుపెరిఁగి యున్నది. ఇటులుండ వారిద్దరును గలియుటెట్లు? అట్లొకవేళ జరిగినను ఇంత మాత్రము నకే మనమేల జంకవలయు? ఇట్టివారు వేయి మంది వచ్చినను నే నొక్కఁడనే వారి మట్టు పెట్టఁగలను. ఈ మాత్రమునకై యుద్ధముచేసి యుండు నీ యన్నకు భటుల నంప వలయునా?

రాజ్యశ్రీ:—మీ మిత్రులానతిచ్చి యుండు లాగున నిట్టి విషయ ముల నుపేక్ష చేయుట తగదని వచించితి నంతయే కాని మీ పరాక్రమమున సంశయము కలదాననుగాను.

దివా:—చెలికాఁడా! నీపత్ని యాడి నట్లొనర్చుట మేలగును. ఇట్టి విషయముల నెప్పటికి నుపేక్ష వహించుట యుక్తముకాదు.

గృహ:—స్వామీ! మీ యానతి చొప్పుననే నడచికొని యెదను.

దివా:—అట్లైన నాకు సంతసమే. ఇఁక సెలవొసంగుము.

అనివారిని వీడ్కొని తన శిష్యులతోడ దివాకర మిత్రుఁడు వింధ్యారణ్య ప్రాంతమున కరిగెను, రాజును నిజపరి వారములఁ దగు రీతిని మన్నించి; నాఁటి సభచాలించి, దేవీ సహితుఁడై యచ్చోటు వాసెను.

## మూఁడవ ప్రకరణము

### శోకవార.

ఎల్ల సుఖములకు నాకరమగు స్థానేశ్వర మొకఁ నాఁటి యుదయమున దుఃఖమున మునిఁగినటుల గోచరించుచుండెను. ఎవ్వనిమోము నవలోకించినను, వైవర్ణ్యముతోఁ గూడియుండెను. ఎట్టి గొప్పవారి యిండ్లను సంతోష ప్రదమగు గీతవాదిత్ర నిస్వనము వినరాకుండెను. ఏవాడం జూచినను ధూళి ధూసరితముగా నుండెను. ఏ దేవాలయము లందును మంగళవాద్య ధ్వనులు చెవులకు వినిపింపకుండెను. ఏవాని వీక్షించినను పెన్నిధిం గోలుపోయిన పేద చందానం గాన్పించెను. సూర్యుని వెలుఁ గెల్లెడలం బర్వుచుండియు నా పౌరుల చిత్తమున నీ లోకము గాఢాంధకారమున మగ్నమయినట్లు గోచరించుచుండెను. వికాస మెచ్చటికో వలసపోయినట్లుండెను. మందునకైనను మందహాసము గానరాదు. ఉత్సాహమూరు వెడలిపోయెను. ఖగముల కలకలారావములు కర్ణగోచరములుగాక యుండెను. వృక్షములు సైత మభినవవికసిత కుసుమములుగాక వాడు బాఱియుండెను. ఇట్లు స్థావర జంగమ ప్రాణులన్నియును విషాదాక్రాంతములై యుండ, నాఁటి యవస్థం బరికించినచో శ్రోత్త్రవాఁడగు నెట్టివానికేని విస్మయము జనించక పోదు.

ఆసమయమున హూణులం జయించిన రాజ్యవర్ధనుఁడు జనకుల దర్శనమున కువ్విళు లూరుచు, నశ్వారూఢుఁడై, అతివేగమున నానగరముం జొచ్చెను. ప్రవేశించిన

వాఁడప్పటి స్థితినిఁజూచి విస్మయ విషాదావేగములు ముప్పిరిఁగొన నిట్లని చింతించెను.

"ఎల్లప్పుడు, నానంద సముద్రమున నోలలాడు నీ నగరము ఇటులుండుటకుఁ గతమేమిటి? జనకుల కేమైన నపాయము సంభవించి యుండునే? వత్సునకు హర్షున కేమే నాపద గల్గియుండునే? రాజ మార్గమునందుఁ బతాకములును, తోరణములును గాన వచ్చుటలేదు కాని ధూళి మాత్రము నిండియున్నది. ఎల్లప్పుడును జనాకీర్ణమగు నీవిపణిశ్రేణి నొక్కఁడైనను నేత్ర గోచరుఁడగుటలేదు. దుకాణములన్నియు మూయఁబడియున్నవి. రణవిజయినై వచ్చిన నన్నెదుర్కొన మంత్రి సామంతాదు లెవ్వరును రారైరి. కాశ్మీరమునం గాంచిన దుస్స్వప్నము మొలకెత్తినదై, మార్గమధ్యమునఁ గల్గిన యుత్పాతముల నభివృద్ధమైయుండు నాకర్మపరిపాక వృక్షమెట్టి ఫలముల నొసంగనున్నదియో యెఱుఁగను. ఇప్పటి యునికిం బట్టి శుభము కల్గునని తోఁచదు. నామది కలఁతవాఱుచున్నది. ఉరమ్ము పగులునట్లు తోఁచెడిని. గుండియలు దటఁదటఁ గొట్టికొనుచున్నది, భయమను మాట యించుకే నెఱుఁగని నా మానసమున నిట్టి తత్తరపాటు గల్గుట ఏదియో గొప్ప యశుభమున కేమ్యమని యెంచెదను. నగర మిట్లుండుటకు కారణమ్ము విచారింత మన్న నెవ్వరును గాన్పించుటలేదు. ఇంతకును కానున్నది కాకమానదు."

అని తలంచుచు రాజ ద్వారమునొద్ద కరుదెంచెను. ద్వార రక్షకు లీతనిఁ గాంచినంతనే "హా" యని విలపింపఁ దొడఁగిరి. రాజ్య వర్ధనుఁడును భ్రాంతుఁడై, కొంతసేపటికిఁ

దెల్పి తెచ్చికొని "మీరిట్లేలవా పోయెదరు?" రని యడిగెను. దాని కుత్తరము వారి రోదనధ్వనులు ఇను మడించుటయే యాయెను. ఇఁక నటనుండిన లాభములేదని యెంచి తిన్నఁ గలోని కేఁగెను. అన్న రాకం దెలిసిన హర్షవర్ధనుఁడు పెద్ద పెట్టున నేడ్చుచువచ్చి యాతని పాదములపైఁ బడెను. ఇది గనిన రాజ్యవర్ధనుని శరీరము కంపింపసాగెను. మానసమున నెన్నియో భావము లుదయించు చుండెను. అంధకార బంధురమగు నొక గోతిలోఁ బడుచుండినటు లితని మదికిఁ దోడఁగట్టెను. శరీరమున నిట్టిదని తెలియ వీలుగాని యొకవిధమగు తీవ్ర వేదన కలిగెను. కడుపున నొక ఱాయిపడి యుండినట్లు భార మొక్కటి గోచరించుచుండెను. కన్నుల నశ్రువు లాతని కెఱుక పడకుండఁగనే స్రవింప మొదలిడెను.

అట్లుండియు నెట్టకేల కించుక ధైర్యమూని తన పాద ముల పైఁబడియుండిన తమ్ముని లేవనెత్తి యంతునకుఁ గారణ మడిగెను. బదులు రాకుండెను గాని కొంత సేపైన పిదప, పరిచారకుల మూలమున నిజ జనకుల మరణ వార్త యెఱుక పడియెను. ఆ మాటవిన్నిన యాక్షణముననే యత్యంత శోకా విష్టుఁడగు రాజ్యవర్ధనుఁడు వేరు తెగిన మ్రానివలె నేలపైఁబడి మూర్ఛనందెను. చెంతనుండు పరిచారకు లెన్నియో యుప చారములుచేయ దెప్పిరిలి యిట్లని వ్యసన పడఁదొ[illegible]

"జనకా! బాలురమగు మాకు, చేయవలసిన హిత బోధ లెన్నియోయుండ, ఇట్లుపేక్షించి పరలోకమున కరుగుట భావ్యమే! తల్లీ! పుత్ర వత్సలయగు నీవును దయమాలి యిట్లు వీడుట పాడియగునే! జనకులార! ఆర్తులగు మమ్మూరడించక

యుదాసీన భావమూన మీ కెట్లు మన సొప్పెను. తండ్రీ! మీ యానతి చొప్పున శత్రువులను జయించివచ్చిన నేను మీవలన నెన్నియో మన్ననలం బొందనెంచి యుండ నాయాశ లెల్ల నేటఁ గలిపి, ఇట్లీ లోకమును వీడి యరుగుటకు నా జేసిన యపరాధ మేమి? తల్లీ! పతితోడం బరలోకమునకుఁ బోవుట యధర్మ మనఁ జాలఁగాని; అతనికిం జెప్పి యిచ్చుటనే నిలుపుట కీవు వలంతివయ్యును అట్లు సేయమిగదుఁ బొరబాటని భావించెదను. ఓ జనకులార! మరణ సమయమున నాయట్టి యభాగ్యుని మోము చూడరాదని తలఁచియా నేవచ్చునంతలోనన, మృతులైతిరి? సోదరా! నీవేసుపుత్రుఁడవు; అప్పుడు నేఁ జెంత నుండినచో, నాకింత చింత కలిగియుండదు. ఇంతకును నా యభాగ్యదేవత నన్నిట్టు లలయించుచుండ, ఎంత చింతించిన నేమి ఫలము! వత్సా! అట్టి తల్లి దండ్రులే గతించిన పిదప నా కెట్టి సుఖములు కావలయు? నేనిఁక సన్న్యాసినై యెచ్చట నైన నేకాంతముననుండి కాలము గడిపెదను. నీవే యీ రాజ్యభారమును వహించవలయును. రాజ్యలక్ష్మిని గ్రహించు టకు నా యట్టి భాగ్యహీనుఁడు తగఁడు. మన మిర్వురము వారి సుతులైనను చరమక్రతువులం జేసి నీవు వారి ఋణముం దీర్చి కొంటివి: ఇంక ఋణగ్రస్తుఁడనగు నేనిట నిలువఁజాలను" అని యాడిన యగ్రజుం జూచి హర్షవర్ధనుఁడును కన్నుల నీరు చిప్పిలుచుండ, డగ్గుత్తికతో నిట్లనెను.

హర్ష:—అన్నా! జ్యేష్ఠుఁడుండఁగఁ గనిష్ఠుఁడు రాజ్యాధికారియ గుట యెందైనఁగలదే! అట్టి యన్యాయము నేనాచ రింపఁజాలను. జనకుల మరణమువలని దుఃఖ ముభయు

లకు సమానమే యగుచుండ నేను మాత్ర మావ్యస
నము వీడి, ఈ రాజ్యసుఖము ననుభవింపఁగలనే!
దాన నుభయులము నిశ్చింపుటకే నరుగుదము.

రాజ్య:—"యుక్తవయస్కుఁడవయ్యును ఇంకను నీ బాల్యపు
చాపలమును వీడకున్నాఁడవు. నీవొక విధమునఁ జన
కుల ఋణమును దీర్చి కొంటివనికదా సేవించినది!
అట్టియెడ నీ విట్లాడుట యసమంజసము. రామునానతి
భరతుఁడు తన కిష్టము లేకున్నను రాజ్యభారము తలపై
నిడికొనలేదా! జ్ఞానవంతుఁడవు. పితృసమానుఁడనగు
నా యానతిని తిరస్కరించుట యుక్తమా!

ఈ మాట లాలించిన హర్షవర్ధనుఁడు, అత్యంత శోకా
విష్టుఁడై యిట్లసి చింతించెను.

"మాయన్న యిట్లనుటకుఁ గారణ మేముండును? కల
హప్రియు లెవ్వరేని మా కిర్వురకు విరోధము గల్పింప నుపక్ర
మించుచుండిరే! అటులుండునని తోఁచుటలేదు. నన్నుఁ
బరీక్షింప నిట్లాడియుండునే! బాల్యము నుండియు నా స్వభావ
మెఱిఁగియున్న వాఁడిట్లాచరింపఁడు. వ్యసన వశమున నొక్కటి
యాడఁబోయి వేఱొక్కటి యాడెనో! ఇంత పట్టుదలతో
నిట్లు నిర్బంధించుచుండ నిది ప్రమాద మెట్లగును? ఇప్పుడునే
నేమిచేయువాఁడ? రాజ్యమును గ్రహింతి మన్న నగ్రజుండు
నవరజుఁడట్లు సేయుట యత్యంత పాపమని గ్రహించియుండు
నాచిత్త మాపాప కార్యమున్న కంగీకరించుట లేదు. వలదని
వారింతమన్న గురుతిరస్కార రూప పాపము గల్గునని నా

మనస్సు దానికి నంగీకరింపకున్నది; ఇట్టి యెడ నే నేమార్గమునం బోవనగును! ఎంత యాలోచించినను రాజ్యము నంగీకరించుట మాత్ర మయుక్తమని తోఁచుచున్నది. గురు శాసనాతిక్రమణ దోషము కల్గినచో, అన్నతోడ నడవులకేఁగి తపమాచరించి, యా పుణ్యమున నీపాపమును బోకార్చి కొనియెదను గాక!"

అని యిట్లు తలపోయుచు హర్షవర్ధనుఁ డవనత ముఖుఁడై యుండెను. ఆ తరుణమున మంత్రి సామంతాదు లెంత నిర్బంధించినను రాజ్యవర్ధనుఁడు వారి మాటలఁ బెడ చెవిం బెట్టెను. హర్షవర్ధనుఁడు రాజ్యవర్ధనుఁ డడవికి వెడలినచోఁ దాను ననుసరింప సిద్ధముగనుండెను. అత్తఱి సంవాదకుఁడను రాజ్యశ్రీ పరిచారకుఁడు పెద్దపెట్టున నేడ్చుచు నటకువచ్చి రాజ్యవర్ధనుని పాదములపైఁ బడెను. అచ్చటి వారెల్లరును తెల్లవోయి చూచుచుండిరి. రాజ్యవర్ధనుఁడును నించుక తడ వేమియుఁ దోఁచనివాఁడై యుండియు సంబాళించికొని యిట్లని పలికెను.

రాజ్య:—ఓయీ! నీకిట్టి చింత కల్గుట కేమి కారణము? నీ యజమానునకుఁ గుశలమేకదా! నీ విట్లొంటిమై నరుదెంచు టేల? నా సోదరి రాజ్యశ్రీయును గుశలినియే కద! చెప్పఁదలఁచిన దెద్దియో నిస్సంశయముగ వచింపుము. వజ్రమున కన్నఁ గఠినమగు నా మానస మెట్టి యమంగళముల విన్నను బగులఁజాలదు.

సంవాద:—దేవా! మా రాజు మాళవరాజుచే నక్రమముగఁ జంపఁబడెను. మృత్యువువలెఁ దటాలునవచ్చి పైఁబడి

సంహరించెనుగాని ప్రత్యక్ష యుద్ధమొనర్చినవాఁడు గాఁడు. మా రాణిని సంకెళులు దవిలించి కన్యాకుబ్జమునంగల కారాగారముననే బాధించియున్నవాఁడని కింవదంతియు గలదు.

రాజ్య:—ఔరా! ఏమి యీ దురాత్ముని మదము! మేమింకను జీవించియున్నారమని యెఱుఁగఁడు కాఁబోలు! గర్వాంధుఁడగువాని కెద్దియుఁ గానరాకుండును. తమ్ముఁడా! ఇంక నాతపశ్చరణము రణమున శత్రుమారణకర్మాచరణమేయగు. నేనునిక్కముగ వానిని జంపక మరలిరాను. నీ వేమియు జంకవలదు. రాజ్యమరాజకమై యుండుట తగవుగాదు. కావున నీవుదానిని గాచికొని యుండుము.

ఇది వినిన హర్షవర్ధనుఁడు నిజాగ్రజుని సంకల్పము వేఱువిధముగ మాఱుటకు సంతసించుచు, వాని వెంట యుద్ధమున కరుగుట కంతరంగమునఁ దన కెంత యిష్టముండినను, ఆతని కెచ్చట నుత్సాహభంగము కల్గెడినో యని యూరకుండెను. రాజ్యవర్ధనుఁడును దన మేనమామ కుమారుఁడగు భండి యను వానిని, గొంత సేనయును దీసికొని మాళవ దేశముపై దాడి వెడలెను.

## నాల్గవ ప్రకరణము.

### రాజ్యవర్ధనుని విజయము.

బావా! నీ యీనాఁటి వైభవముఁజూడ, ఆనాఁడు నీతురీయాశ్రమ స్వీకారమునకే నొనర్చిన భంగమునకు వ్యసనమందు వాఁడనుగాను. ఇటుల విజయలక్ష్మీ వృతుఁడవగు నిన్నుఁ జూచుచుండుటచే నాకీయుద్ధమునఁ గల్గిన శ్రమయంతయును మాయమాయెను. ఇంతటి యానందము నా కెన్నఁడును గల్గియుండలేదు——కాని,

అని యీలాగున భండి యాడినంతనే రాజ్యవర్ధనుఁ డిట్లనెను,

రాజ్య:——రాజ్యశ్రీ కింకను బంధవిముక్తి కాలేదనుట యొక్కటియేకదా నీచింత! అదెంతటిపని! నేఁడే వెడలుదము.

భండి:——నేను దెలుపఁదలఁచినదది కాదు.

రాజ్య:——ఇంక నేది?

భండి:——ఈ దేవగుప్తున కనుకూలురగు వారలనట్టే విడుచుట యుక్తముకాదు.

రాజ్య:——అట్టి వారనేకులు ఈ యుద్ధమున మరణించిరి. ఒకరిద్దఱుండిన వారలు గోఱలు పెఱికిన పాముల వలె నేమియు నొనర్పఁజాలరు.

భండి:——కపటవర్తనులగువారు సమయము కొఱకు నిరీక్షించుచుండి, శక్తి గల్గినంతనె పైఁబడుదురు. కాఁబట్టి శత్రుశేషము నిలుపఁదగదు.

రాజ్య:—నేఁడు నీకిట్టి చాపలము గలుగుటకుఁ గతమేమి? క్రొత్త విషయము లేవైనఁ జెవిసోఁకెనా?

భండి:—గౌడ నగరాధీశుఁడు మాళవ రాజునకుఁ దోడ్పడ నుంకానఁట. వీరిర్వుర కనేక దినములనుండియు గుప్తముగా రాయబారములు జరుగుచుండినవఁట. దాన నీతఁడును మన విరోధి వర్గములోని వాఁడే యగును. ప్రత్యక్షముగ నీతోఁ బోరనేరమి మిన్నకున్నవాఁడు. కాని సమయము తటస్థించినచో విడువఁడు. కాఁబట్టి వాని నుపేక్షించుట పాడిగాదు.

రాజ్య:—విజయినగు నను గారవింప నరుదెంచువాని యెడ సంశయ మూనుట తగని పని.

భండి:—దీననే నీ యమాయికత్వము తేటఁబడుచున్నది. ప్రకటముగ నీతో యుద్ధముసేయ శక్తి చాలమి వంచనచేఁ బరిమార్పనెంచి, నీతోడఁ గపట స్నేహము నెఱపనెంచి, ఇట్టి సందేశమంపి యుండనోపు.

రాజ్య:—నీవనునటుల నాపై ద్వేష ముండు నెడల "జయలక్ష్మికిఁ దోడుగ నాకూఁతును బెండిలి యాడు"మని యేల వర్తమాన మంపి యుండును? అభిమానియగు వాఁడు కూఁతు నిచ్చెదనని చెప్పి యిట్టి కట్టడి సేఁత కొడిగట్టునా?

భండి:—కూఁతు నిచ్చెదనని చెప్పునదియు మాయ మాటయే యని యెంచుము. కుత్సితు లెప్పుడును దలఁచున

దొక్కటి, చెప్పున దొక్కటి, చేయున దొక్కటి యనుట నీకుఁ దెలియదా?

రాజ్య:—నీవే మనినను వాని మోము నొక తూఁటిచూచినఁ గాని నా మనసున కది గోచరముకాదు. మనసులోని భావములకు మోముకదా ముఖ్యాదర్శము!

భండి:—కపటశీలురు దమ భావముల వెలికి తోఁప నీయ రనుట నీ వెఱుఁగవా?

రాజ్య:—వాఁడెట్టి వాఁడైనను వాని యపరాధము ప్రత్యక్ష మగు దాఁక మిన్నకుండుట భావ్యము.

భండి:—అట్లని యూరకున్న గోరఁ బోవునది గొడ్డఁటం బో కార్పవలసి వచ్చును.

రాజ్య:—అయిన నన్నిప్పుడేమి సేయుమనెదవు?

భండి:—నీచునిఁ దుదముట్టింపఁ బ్రయత్నింపు మనెదను.

రాజ:—నే నకారణముగ నొక్కనికిఁ గీడొనర్పను. ఇంచుక యోపికవట్టి యుండుము. వానితోడి సంభాషణము మూలముననే వాని యభిప్రాయమును గనుఁగొనఁ గలను. ఇంచుకేని సంశయ ముదయించిన నటు నిముస ములోన వానినిమట్టు వెట్టెదను.

భండి:—సరి—అట్లె యొనర్పుము.

అంభీరుఁడు
సంవాహకుఁడు }:—ఆర్యులార! రక్షింపుఁడు, రక్షింపుఁడు, ఆపన్నులమగు మమ్ము. మరణించిన మా రాజుయొక్క యవినయముమూలమున మొదలే నొచ్చియున్న వారము.

అందుకుండ్రోదు తామడాంబరమ్మును మమ్ము పట్టికొని యాడించుచున్నది. గోరుచుట్టుపై రోకటి పోటన్న టుల నిప్పుడు కొంతకాలముగ నీ యుజ్జయినీ ప్రాంతా రణ్యమునఁగల చోరులు చెలరేఁగి మా పల్లెలపైఁబడి మమ్మనేక కష్టముల పాలుసేయుచున్నవారు.

రాజ్య:—జానపదులార ! భీతిలకుఁడు. నాయీ సేనాధిపతి మీ కష్టములఁ బోకార్చును—భండీ ! నీవీ జానపదులను చోరుల బారినుండి రక్షింపఁ గతిపయ సేనాసమేతుఁడవై యరుగుము. నే నిచట నేయుండి రాజ్యాంగ విషయములఁ గొంత సంస్కరించుచు శిథిలములగుఁ గోటలను జక్కఁ బఱచుచుందును. ఇంతలోన శశాంక గుప్తుఁ డరుదెంచినను వానిఁ బరీక్షించి యప్పటికిందగు విధాన మాచరింతును. కృతకృత్యుఁడవై నీవు రాఁగానేక న్యాకుబ్జమున కరుగుదము.

భండి:—బావా ! నీయానతి జవదాఁటువాఁడనుగాను. నేవెడలి వత్తును. శశాంక గుప్తుఁ డత్యంత కపటి; కాఁబట్టిమిగుల జాగరూకుఁడవై తులఁగ వలయునని మఱియొక తడవ కును నొక్కి చెప్పుచున్నాను.

రాజ్య:—నీకు నాయందుఁగల మక్కువ యాలాగున వదు—గడుగునకును నొక్కి చెప్పుమనుచున్నది కాని, నీవు మాత్రము నాబల మెఱుఁగనివాఁడవా ? నేనును నీమాటలఁబాటింపని వాఁడనా? వాఁడెంతటి వంచకుఁడైనను వాని మాటలనుండియే హృదయములోని భావమును

గన్నుఁగొనఁగలను అట్టులించుక సంశయము గలిగినను వెంటనే వాని నా యాఖడ్గమునకు బలి యొసఁగఁ గలను.

అంత భండియుఁ గొంత సేనం దీసికొని యట నుండి కదలెను. సిద్ధపఁ గుంతలుఁడను సేవకుఁ డరుదెంచి "శశాంకగుప్తుఁడు కానుకల తోడ వచ్చుచున్నవాఁ"డని నుడివెను. రాజ్యవర్ధనుఁడును వాని నెదుర్కొన సంసిద్ధుఁడై యుండెను. ఇంతలోనఁ గొంత పరివారముతోడ శశాంకగుప్తుఁడును వచ్చెను. తాఁ దెచ్చిన రత్నభూషణములును, చీనాంబరములును రాజ్యవర్ధనుని ముందఱ నిడెను. అతఁడును వచ్చినవాని నుచితరీతి సత్కరించి యాసనోపవిష్టుఁ గావించెను.

రాజ్య:—వంగ దేశాధీశా! రాజ్యమును వీడి యింతదూరము సేనా సమేతుఁడవై వచ్చుట కీప్రాంతమున నెచ్చటనైనను యుద్ధము తటస్థించియుండ నోపునని తలఁచెదను.

శశాంక:—నేనీ ప్రాంతమున యుద్ధము జరుగఁ బోవుచున్న దన్ని విని నామిత్రునకుఁ దోడ్పడనెంచి యాతనియాజ్ఞను ప్రతీక్షింపక యే వచ్చినాఁడనుగాని, న్యాయము మఱకఁ అలేక యే యాకార్యమ్ము కొనసాగెనని వింటిని. అంత నాకుఁ బనిలేక పోయినను మిత్రస్నేహము నన్ను తొందరపెట్టుటచే నేలాగుననైన హితున కుపకృతియొనర్ప నెంచి వచ్చితిని.

రాజ్య:—నీవు మాళవనాథునకుఁ దోడ్పడ వచ్చియుంటివి కాఁబోలు! దైవవిధి విపరీత మగుటచే నీవు తలఁచినటుల

జరుగలేదు. ఇంక మరణించిన మిత్రున కుపకారమెట్లొ నర్పఁగలవు? మిత్రుని మరణమునకుఁ గారకుఁడగు వానిం గడతేర్చినచోఁ జెలికాని కుపకారము గావించినట్లగును.

శశాంక:—మిత్రమా! నామాటల కన్యథాయర్థము గావించి కొంటివిగా! మాళవేశునకును నాకునుగల మైత్రి యెట్టి దనుట లోకమున కెల్ల విశదమగునదే కదా! అట్లుండ నీ విటులఁ బొరపడుటకుఁ గారణము తెలియుటలేదు. నీకు సాయపడ నరుగుదెంచితిని గాని యంతటి సుకృతము నా కబ్బునందున నీవు గ్రహించిన జయలక్ష్మికిఁ దోడుగ నా తనయనిచ్చి చెలికాని కుశకృతి సేయనెంచి వచ్చితిని.

రాజ్య:—సెయ్యుఁడా! నేను మాత్రము మైత్రిని బాటింపని వాఁడనా?

శశాంక:—నీకు నాయెడల నిక్కమగు ప్రీతియే యుండినయెడల నేఁటి రాత్రికి నా విడిదికి విందున కరుదేర వలయును.

రాజ:—మిత్రవాక్యమునకు మారాడువాఁడనుగాను.

శశాంక:—అయిన నిఁక నాకు సెలవొసంగుము.

రాజ్య:—సరి.-పోయిరమ్ము. తప్పక యీ దినమున మీయింటి కరదేరఁగలను.

శశాంక గుప్తుఁడును రాజ్యవర్ధనుని వీడ్కొని వెడలు చుఁదన యింటికివచ్చు నారాజేంద్రుని సంహరించుటకుఁ దగు నుపాయమును మానసమున నారయుచుండెను. రాజ్యవర్ధనుఁడును నాఁటిరేయి మిత్రునింటికి విందునకుఁ బోవఁ గృత నిశ్చయుఁడాయెను.

# అయిదవ ప్రకరణము.

## హర్షవర్ధనుఁడు

---

గంగానది కూలంకషముగా, ప్రవహించుచుండెను. విన తులగువారు పొందుల్లాభము నెన్నటికి నున్న తులుపొందఁజాల రనుట యాచార పూర్వకముగఁ దెలుపుచున్నట్లగున నానతము లగు ప్రబ్బలి తీఁగలకు భంగము గల్గింపక యున్నతములగు వృక్షములఁ గూఁకటివ్రేళ్లతోడఁ బెకలించుచుండెను. హిమాలయమునం బుట్టిన యీ మహానది యచ్చటి ప్రవాహవశమునం జట్టుపట్టులంగల యేనుఁగులు కొట్టికొని వచ్చుటచే నీటి యేనుఁగుల జ్ఞప్తి పఱచుచుండెను. తెల్లని నురుగులుగల యలల నుండి చల్లనిగాలి మెల్లమెల్లన వీచుచు నెల్లర కుల్లాసము గల్గించుచుండెను. గట్టులను గోయుచుఁ జెట్టులను ద్రోయుచుఁ బ్రవహించు నీజీవనది మట్టుమీఱ ఘోషించుచు "గంగాయాం ఘోషః" అనుదాని నభిదోదాహరణముగఁ జేయుచుండెను. హంసమిథునము లనేకములీతరంగిణీ తరంగములను తూఁగుటుయ్యాలల నూఁగుచుండెను.

అట్టియెడ నాయేటి యొడ్డున నొకనాఁటి యుదయమునఁ గొన్ని శిబిరములు గన్నుల పండువు సేయుచుండెను. అందొక్క పటకుటీరము నానా వర్ణములగు పట్టుబట్టలచే నలంకృతమై యుండెను. ఆ శిబిర ద్వారమున నిర్వురు భటులు ఖడ్గధారులై కాచికొని యుండిరి. వారు ధరించిన తెల్లని యుష్ణీషములయందలి జరిపై బాలసూర్యుని కిరణములు పడుటచే నది

తళతళమని మెఱయుచుండెను. ఆ శిరోవేష్టనముపై వారు చుట్టికొనియుండు ముత్యపు సరములందలి తారళ్యమా మెఱుగునకొకవింత సోయగము నాపాదించుచుండెను. వారి నయనములంగాంచినంతనే, వారి జాగరూకత వెల్లడియగునట్లుండెను.

వారు కావలి గాయుచుండు నాపట కుటీరములోపైపున చిత్రవర్ణ భాసురములగు రత్నకంబళములు బఱచియుండెను. చుట్టును నానా విధములగు పటములు వ్రాలియుండెను. అందొకపైపున సింహపీఠిక యొక్కటి యమరియుండె. దానిపై నొక యువకుఁడాసీనుఁడై యుండెను. అతని ప్రాయము రమారమి యిరువది వత్సరములుండును. ఆ యువకుని నూనూఁగు మీసము లాతని కప్పుడే యౌవనోదయ మాయెననుట వెల్లడి సేయుచుండెను. అకర్ణాంత విశాలములగు లోచనములును, విశాల వక్షమును, ఆజానులంబి బాహువులును, గంభీరాకృతియును నాతఁడు మహారాజనుట చెప్పకయే తెలియనగుచుండెను. రూపవంతుని కుపమానము సెప్పుట కంగవిహీనుఁడగు మన్మథుని దృష్టాంతీకరించుటకన్న, ఈసుందరు నుపమానము గావించుట యొప్పిదమగును. అతని మోముమాత్ర మేలకో వైవర్ణ్యమునంది వాడఁబాఱి యాతని మనసులోనంగల చింతను వెలిఁబుచ్చుచుండెను. అతని యెదుట దీర్ఘకాయుఁడును స్థూలశరీరుఁడునగు నొక పురుషుఁడు తనకై వేసియుండు వేఱొక యాసనమున నుపవిష్టుఁడయ్యెను. మహారాజ లక్షణ లక్షితుఁడగు నా సింహాసనాసీనుఁడు :

" ఆహా! హూణ హరిణ కేసరియన్న ప్రసిద్ధ బిరుదము వహించిన ప్రభాకర వర్ధనుని గర్భమున జనించి పరాక్రమ

శాలియని వాసిగాంచియు, సమరమున నాయన్నకుఁ దోడ్పడ లేకపోతిని. బుద్ధిహీనుఁడనై యింటనిలచితిని. అప్పుడు, నేనును నాయన్నతోడ వెళ్లియుండిన ఇట్టివైపరీత్యము గలిగియుండ నోపదు. వంచనచే జరిగిన కార్యమునకు నేఁజింతనుఁడిన మాత్ర మేమిచేయఁగలను? దైవము సేఁతగాకున్న రాజ్యవర్ధను నానీచుఁడు సంహరించునా! కానీ—ఇంక వీఁడెట్లు తప్పించికొనునో చూచెదనుగాక. ఎప్పటికైన శశాంక గుప్తుఁడు నాబాణములకు గురి కావలసినవాఁడే. వాఁడెచ్చటి కేఁగినను ఎవ్వాని నాశ్రయించినను నాయాయుధ మాతని విడువదు.

ఓరీ! మూఢా! నీ దేశమంతయు నొక్కపెట్టున పాడు సేయఁగల ననుట దెలియకుంటివిగా! ఛీ! ఇదియు నొక బ్రదుకా! కూఁతు నిచ్చెదనని చెప్పి నమ్మించి, నీ యింటికి రప్పించికొని, విశ్వాసఘాతుకుఁడవై ఘాతుకుల మూలమున ఇట్లొనర్చుటయును ఒక పౌరుషమా! తుచ్ఛుఁడవగుటచే నీ వట్లు మోసము సేసినను నేను బహిరంగముగ నీతో యుద్ధమొనరించియే నిను సంహరించెదను. శ్రీరాముఁడు దర్భనభిమంత్రించి కాకాసురునిపై విసరివైచిన లాగున నా ఖడ్గమును విసరివైచినచో అదియే యవలీలగ నీ ప్రాణములఁ దీయఁగలదు. నా కొనవ్రేలి గోటికైన సరిపోలని నిన్ను దెగచుట యొక గొప్ప పనికాదు. నీ వాచరించిన పాపకార్యమునకు తగునట్లు నిన్ను చిత్రవధ గావింప వలయును గాని యొక పోటుచే చంపుటయుచితము కాదు.

ఔరా! ఏమి నీ యజ్ఞానము! పరమ సాధ్వి మతల్లి యగు నాసోదరి రాజ్యశ్రీనిం జెఱఁబెట్టినందున ఆదేవ

గుప్తుఁడు మరణించెను. ఇది తెలిసియు నించుకేని జంకు గొంకులేక యింకన్ను ఆమెకు వ్యసనము గలుగు లాగున నిట్టి యకార్యము నాచరించెను. చందన వనమునఁ గంటకద్రుమ ముదయించినటుల ధర్మాత్ములు జనించిన సద్వంశమున ఈ నీచుఁడుపుట్టి వారిపేరునకుఁ గళంక ముత్పాదించుచున్నాఁడు. ఇట్టి పాపియగుటచేతనే వీని రాజ్యమునందలి ప్రజలు సైతము వీనిరాచఱికమున కిష్టపడకున్నవారు. ఇఁకనేను వీని విషయమున నుదాసీనభావ మూనుట సరికాదు.

అయ్యో! ప్రతిపక్ష భయంకరుఁడగు ప్రభాకర వర్ధనుని యనుంగు కూఁతురవై, పరాక్రమమున వాసిగాంచిన యట్టి మాకు సోదరివై యనదవలె నీ వవస్థపడుట యెంతటి విపరీతము! సోదరీ! నీ యాపత్సమయమున నిను గాపాడలేని యీసోదరు లున్న నేమి? లేకున్న నేమి? అయినను నాకన్న నన్నయ్య కొంత మెఱుఁగని తలఁతును. ఆతఁడు నిను గాపాడకున్నను శత్రు సంహార మొనర్చియైనను గొంతవఱకు పగ సాధించికొనఁ గలిగెను. నే నామాత్రమునకును నోఁచికొననైతినికదా! సమయమున స్ఫురింపని బుద్ధియు, కష్టముల నాదుకొనని బంధువు, నాపదల నుపయోగింపని యాయుధము నొక్క కోటిలోనివేయుగును. ఆహా! చెఱఁబడు సమయమున మాచేనెట్టి ప్రయోజనముం గాంచమికి ఎంతవగచితివో! సుకుమారిణివగు నీవింక ఎంత కాల మిట్లు బాధింపఁబడి ఆ కష్టముల నోర్వఁగలవు? ప్రథమమున నీ బంధవిముక్తిం గావించి యావల శత్రు సంహారమునకుం గడఁగువాఁడను.

హా! నేనేమి యిట్లు పొరపడుచున్నాను! ఒక వైపున భర్తృ మరణమును, ఇంకొక వైపున బంధన ప్రాప్తియు ఇట్లు వ్యసన మధ్యస్థురాలవగు నీకు భ్రాతృ మరణవార్తం దెలిపి ఇంకను దుఃఖము నభివృద్ధి పఱుపఁజాలను. మున్ముందుగ శత్రునాశము గావించి తత్కాలమునఁ గల్గిన సంతోషముతోఁ గలిసిన సోదర మరణవార్త నీకెఱిఁగించుట యుక్తతరము. ఎట్లును సహోదరమరణదుఃఖ మసహ్యావేదనమేయగును. భార్యాహీనునకుఁ గళత్రమును, చుట్టములు లేనివారికి బాంధవులు నేదేశమున నేసమయమున నేనిఁ జిక్కుదురు. సోదర హీనునకు మాత్రమెచ్చట నెప్పుడును సహోదరుఁడు చిక్కఁడు."

అని యిట్లు చింతించుచుండ సమీపమున నాసీనుఁడైన దీర్ఘకాయుఁ డిట్లనెను.

"ఆయుష్మంతుఁడా! నీయట్టివారీలాగునఁ బామరుల వలెఁ జింతాక్రాంతులైన కార్యములెట్లు కొనసాగుట? ఎంత కాలము వగచినను మరణించినవారు మరలి రాఁగలరా? కావున నీ దుఃఖము మాని హర్షవర్ధన నామము నన్వర్థము గావింపుము.

హర్ష:—బావా! నేనుదాసీన భావమూని యుంటినని తలఁచితివా! నీయూనతి చొప్పున సేనల నెల్లం గొనివచ్చి యుంటిని. జరుపవలసిన విధానమును నీ వేలాగున నుడివిననటుల నాచరింప సంసిద్ధుఁడుగ నున్నాఁడను, నాకు మిత్రమవ్వయినను, చుట్టమవ్వయినను నీవేకదా! స్థానే

శ్వర రాజ్యము నెలకొల్పుటకు భండియే పునాది వంటి వాఁడని లోకు లనుకొనుట నేనెఱుఁగనా!

భండి:—రాజకుమారా!—మహారాజవగునీ పూర్వపు చన వున నిట్లు పిలచినందులకు మన్నింపఁ వేఁడి కొను చున్నాఁడను.

హార్ష:—మాననీయుఁడవగు నీవు నన్నాజ్ఞాపించుట సరియగుఁ గాని యీలాగునఁ బ్రార్థించుట బాడి కాదు.

భండి:—విశాల హృదయుఁడవగు నీకా లాగునఁ దోఁచుట వింత కాదు. సరి—మన మిప్పుడు సేనలతోడ నరుగు దెంచి యుంటిమి కదా! మీఁద జరుపవలసినదే లాగున ననియాలోచించితివి?

హార్ష:—అదియే నాకును బాలుపోవకున్నయది. శత్రు సంహా రమునకుఁ గడంగుట మున్నా; సోదరీ బంధ విమో క్షణమున కుపక్రమించుట మున్నా యని యాలోచించు చుంటిని!

భండి:—తుద కేమని సిద్ధాంతీకరించితివి?

హార్ష:—ప్రథమమున సోదరిని విడిపించి యామెకీ భ్రాతృ మరణవార్తం దెలుపుట కంటెను ముందుగ శత్రు సంహారమొనర్చి యావల నామెను బంధవిముక్తురాలిని గావించినచో శత్రు మరణము మూలమున నించుక శాంతించిన భ్రాతృ మరణదుఃఖ మోర్చికొనఁదగిన దగునని తలఁచెదను.

భండి:—నీ విటు లాలోచించుట నాకు నచ్చుటలేదు. శత్రువును సంహారింప మున్ముందుఁ బ్రయత్నించినచో మాయావియగు నా నీచుఁడామె కేమైన నెగ్గొనరించిన మనపడిన పాటెల్ల వ్యర్థమగునుగదా! అబలయగు నామె నాపదనుండి తప్పించినచో ఆవలి కార్య మవలీలగా జరిపికొనవచ్చును. ఇది నాకుఁ దోఁచు నుపాయము. మేధావంతుఁడవగు నీవు బాగుగ నాలోచించి తగురీతి నాచరింపుము. నీయాడినదాని కన్యథా జిరుపువా రిచ్చట నెవరు గలరు?

హర్ష:—చింతార్ణవ గతుఁడనగు నాకు నీమంత్రమను నావ దక్క నింకెద్ది యుత్తారకము? కాఁబట్టి నీయాడిన చొప్పుననే జరిపెదను.

భండి:—స్వబుద్ధిని వీడి కేవలము పరబుద్ధియే ప్రధానమని యెంచుట తగదు.

హర్ష:—ఇది పరబుద్ధి యెట్లగును? ఇయ్యది గురుబుద్ధి కావున దీన విశేష సుఖము గలుగును.

భండి:—నృపాలా! రాజ్యభారము పైఁబడు కొలఁది గర్వ మెక్కు డగుటకు మాఱుగ నడఁకువ అధికమగుట ఎంతయు నుతింపఁదగును. నీయిప్పటిరీతి భగవంతుఁడు నిజభక్తుల భక్తికిమెచ్చి వారికి లోఁబడు లాగున నున్నది.

హర్ష:—అది యట్లుండ నిమ్ము. ఇపుడు కన్యా కుబ్జమునకు మన మరుగవలయుఁగదా!

భండి:—ఔను.

హర్ష:—అట్లే నీకై సేనల నాయత్త పఱపుము.

భండి:—మన మిట్టి సన్నాహముతో నరిగిన శత్రువున కెఱుక వడఁగలదు. అంతవాఁడు నీసోదరి కెద్దేనిహానిం గల్పింప నోపును. కావున మనము సముచిత పరివారముతో నేఁగవలయును. సేన లెల్లం జీలి వేర్వేఱు దారులంబట్టి కన్యాకుబ్జమునకు రావలయు. ఇట్లాచరించుట యుచితమని నామతము.

హర్ష:—అట్లే కావించుము.

అంత భండి హర్షవర్ధనుని వీడ్కొని తన గుడారమున కరిగెను. హర్షవర్ధనుఁడును తనకు ఇట్టి సేనాపతి చిక్కుట కలరి తనమనసునఁగల వ్యసనము నించుక శాంతి పఱచికొనెను.



## ఆఱవ ప్రకరణము.

### బంధవిముక్తి.

---

"ఆహా! దైవ మనుకూలింపకుండినఁ బౌరుష మెంత యుండినను నిరుపయోగమ యగు. నే నిచ్చటి కప్పుడే వచ్చి యుండినచో నంతయును అనుకూలపరిణామి యయియుండును. మార్గ మధ్యమున ఆ దొంగలకుఁ జిక్కకుండిన ఇట్టి విపరీతములు సంభవింపకుండును. ఆ నీచులు ద్రవ్యశూన్యుఁడనగు నన్నేమిసేయఁ బోయెదరని యెంచితినిగాని తమదేవత కాలాగున నన్ను బలి యొసంగ తలఁచిరని తెలియనైతిని.

నీచులార! ఈశ్వరుఁడు లేఁడని యెంచికదా మీరిట్టి యకార్యమున కొడిగట్టితిరి? తుదకు మీసేఁతకుందగు ఫలమ కదా యనుభవించి తీరితిరి! దేవుఁడిచ్చటను గలఁడనుట నా మెడపైఁ బడనుండు కరవాలము నట్టేపట్టి ఆభండ మిమ్మెల్లరందును మాఁడుచుండినపుడైనం దెలిసి కొంటిరా! ఏమి యీ వీరుని సామర్థ్యము! ఎట్టి వారికిని బట్టువడక తప్పించికొని తిరుగుచుండిన వీరిని బట్టునపు డాతఁడు చూపిన పరాక్రమ మెంతయుఁ గొని యాడఁదగినది! అట్టి మహాత్ముఁడే చెంత నుండినచో నీ నీచ శశాంక గుప్తుఁడు రాజ్యవర్ధనుని జంపఁ గలఁడా!

ఓరీ! తుచ్ఛా! ప్రత్యక్షముగఁ బోరలేక మాయోపాయముల రాజ్యవర్ధనుని గడ తేర్చినది చాలక, చెఱనుండు రాజ్యశ్రీని ఎట్లని నీయూరికి రప్పించికొని చెఱుపఁ జూచెదవుగా! మయ శంబర మారీచాదులమించు మాయలమారివే

యగుదువుగాక. దైవ యత్నము లేకున్న నీయాటలు కొన సాగవు.! నిన్న మార్గాయాసమున నీయూరి వెలుపలనున్న ఆ పొదలో నే విశ్రమించియుండ దాని కించుక సమీపమున నుండు నా మఱ్ఱినీడ నాసీనులైయుండిన ఆ మాయ సన్న్యాసులు సంభాషించుచుండ నేను వంచన యంతయు యాదృచ్ఛికముగ నాలకింపఁ గలుగుట దైవ కృపచేఁగదా! ఇంక నీ యాటలు సాగనేరవు. క్రొత్తవాఁడనగు నాకీ కన్యాకుబ్జమున ఈ కార్యమునకు సాయపడువార లెవ్వరని యాలోచించుచుండ దైవ వశమున మా యూరిదగు మంగలికయను రాజాంతఃపుర పరిచారిక యెదురై తా నీ విషయమునఁ దోడ్పడు నట్లు అంగీకరించెను. ఆమె మూలమున రాజ్యశ్రీ దేవిని వీరి బారిఁ బడక తప్పింపఁగలను.

అనియిట్లు లోకనాఁటి రేయిని గన్యాకుబ్జము నందలి రాజమార్గమునఁ బోవుచుండు నొక పాంథుఁడు గలఁచుచుండ మంగలికయు నాతనికి ఎదురుపడెను.

"మంగలికా! జాబు చేరులోపల నామెను దప్పించెద నంటివే! అది యేమాయెను.

మంగలిక:—ఒయీ! గాలవా! ఆభారము నాపైనుండ నీకా చింతయేల? నా మాటలయందు విశ్వాసములేదు కాఁబోలు!

గాలవుఁడు:—నేను నిను నమ్మకపోలేదు. సత్యసేనుని మాట చొప్పున నడచికొన నేరక కార్యమును జెడఁగొట్టి కొనినందునఁ గల్గిన పశ్చాత్తాపము నన్నిట్లాడఁ బ్రేరేపించుచున్నయది.

మంగలిక:—నా మాట యన్యథా జరుగదని తెలియుము. ఆమె వారిబారిఁ బడకుండ రక్షించుటకు నేనుబద్ధ కంకణనై నిలచియున్నాను.

గాలవుఁడు:—నాకు నంతయే చాలును.

మంగలిక:—నే నిటఁ దామసించుట తగదు. నాకు సెలవిమ్ము, పోయివచ్చెదను.

గాలవు:—అటులనే కావింపుము.

అంత గాలవుఁడును మఱునాఁడా యూరినుండి వెడల నిశ్చయించినవాఁడై తన విడిదికరిగెను. మంగలికయు నాతని వీడ్కొని వెడలుచు రాజవీథి నరిగిన రాజభటులు తిరుగు చుందురు కాఁబట్టి యా మార్గమునఁ బోవుట సరికాదని భావించి యచ్చటఁగల యొక సందుదారి నరుగుచుండెను. వెనువైపున నడుగుల చప్పుడు వినవచ్చుటచే నెవ్వరో తన సమీపమునకు వచ్చుచున్నారని యెంచెను. వెనుకకుఁ దిరిగి చూచెను. గాఢాంధకారా వృతమగు నా నిశాసమయమున నామె కేదియును గోచరింపలేదు. అంత నాబిడ యథా ప్రకా రము బోవుచుండ మరల నడుగుల చప్పుడు వినవచ్చెను. మంగళికయు మరలఁ దిరిగి చూచి, శబ్ద మేదేని గల్గునేమో యని దత్తావధానయై వేచియుండెను. అప్పుడు కల్గిన శబ్దము చొప్పున్ను బట్టి ఒకరు ముందుగ నింకొకరు వారి వెనుకను వచ్చుచున్నవారనుట నూహించెను. భీతచిత్త యాయెను. మరల నించుక ధైర్యమవలంబించి "ఎంతటి ధైర్యము దెచ్చి కొనినను స్త్రీలకు సహజమగు భీరుత్వము నను వీడకున్నది. రాజమార్గమునఁ బోయిన రక్షక భటులుందురుకదా యని

మొంచి యీ సందు దారిఁ బడితిని. ఇచ్చటఁగూడ నపాయము వాటిలునేమో యని సంశయించుచున్నాను. ఇప్పట్టున నేమి చేసిన మేలగును? ఎటనైనం దాఁగియుందునా? వచ్చెడివారును నను గనిపెట్టుచునే యుందురు. అట్టియెడనే నెట్లు తప్ప వీలగును?॰ అయినను వీరిపుడు నన్నే వెదకుచు వచ్చుచున్నారను టెట్లు? అచ్చట నిరువురి యడుగుల చప్పుడు విన వచ్చుచున్నది. వారిలో నొక్కరు మఱియొకరిని దఱుముకొని వచ్చుచుండఁగూడదా? ఎట్లు నిదె కనఁబడు నీ పాడు బడిన యింటు, దూరెదనుగాక."

అని యిట్లు తలపోసి మంగలిక యా యింటం బ్రవేశించెను. తలుపుల గడియవైచి కొనియెను. అంత నొక వ్యక్తి సంభ్రాంతమగుచు నావైపుననే వచ్చెను. అదియు నాయింటం దూర నెంచెనుగాని కవాటము బంధింపఁబడియుండుట చేఁ బ్రవేశింప వీలుగాకుండెను. మరలఁ బర్వులిడఁ దొడఁగెను. మఱియొక వ్యక్తియు ముందుఁబోవుచుండు వ్యక్తిని దఱిమి కొనుచు నేఁగుచుండెను. ఇట్లా వ్యక్తి ద్వయము నా ప్రాంతమునంగల సందు లంతయుం దిరుగుచుండ, ముందుఁ బోవుచుండు వ్యక్తి తన ముందు వైపుననుండు నొక యింటి దిడ్డి త్రోవనలోనం బ్రవేశించి యా కవాటమును బంధించి కొనెను. దానిం దఱిమికొనివచ్చు వ్యక్తియు వేగ వశమున నింకం గొంత దూర మరిగెను. ముంతడుగుల చప్పుడు వినరాము నచ్చేరువడి;

"ఏమి నాయజ్ఞానము! చేయిఁ జిక్కిన దానిం బోఁగొట్టి కొంటిని॰ ఇంక నాతనికి బదులేమి చెప్పఁగలను? అహో! ఇట్టి తెలివిలేని నేనప్పుడేల బిరములఁ బల్కవలెను? ఇప్పట్టునఁ

జింతించుచుండిన ఫలమేమి? ఇది నాకు నూతన స్థలమగుటం బట్టి యొరులతోఁ జెప్పికొనుటకును అనువుగాకున్నది. దొంగకుఁ దేలు గుట్టినలాగున నాకీ సమయమున 'మౌనావలంబన మే మేలగును. నా మిత్రమును రాక తడయుటకుఁ గారణ మూహింపఁజాలకున్నాను. నా నెచ్చెలికి నిది క్రొత్తచోటగు టచే దారి తప్పి చిక్కులు పడుచుండనోపును. కానిచో నిట్లాల సింపఁ గారణములేదు. ఇంతకును గానున్నది కాక మానదు."

అని చింతించుచు నెట్లు నావ్యక్తి ముందునకే పోయియుం డనోపునని నిర్ధారణ గావించికొని తానును ముందునకుఁ బోవు చుండెను. అచ్చటఁగల సందు గొందుల నెల్ల నన్వేషించెను. ఈలాగున నల్లెడల వెదకి వెదకి వేసరి ఏమిరా యాలో చించుచుఁ బోవుచుండెను. ఇటులఁ గొంత దవ్వరుగు నప్పటికి వెనువైపునఁ బదధ్వని వినవచ్చెను. అంతం దన నెచ్చెలియే వచ్చుచుండ నోపునని తలఁచెను. వెనుకకు మరలిచూచెను. సందడి యేమియు లేనందున సందేహించెను. ఎట్టి యపా యము గలుగునో యనెడి భీతిచే నంగములవదఁకఁజొచ్చెను. మేను జెవుర్చెను. గుండియలు దటఁదటఁ గొట్టికొనసాగెను. ఇంకఁ దా నిటులఁ దిరుగుట బాడికాదని యెంచి రాజమార్గ మునకు రాఁబ్రయత్నించి యించుక వేగముగ నడువఁదొడఁ గెను. మరల యథా పూర్వముగ నడుగుల చప్పుడు విన వచ్చెను. అంత రెట్టించిన భీతిచే, నా వ్యక్తియు:

"ఎట్టి యాపదలయందును ధైర్యము వీడని నాకిప్పుడేల కో యింతటి భీతి జనించినది! ఇదిచూడ నెద్దే నశుభము సంభ వింప నోపునని తోఁచెడిని. ఇది నా కష్టానుభవ నాటక

మునకుఁ బ్రస్తానన యని యూహించుచున్నాను. నా యొనర్పిన చెడు చేఁతల ఫలముకట్టి కుడిపింపక యూరక వీడునా? ఎట్లైనను ఇప్పట్టున ధైర్య మవలంబించుటయే కర్తవ్యము. ధీరున కాపదలును గొంతవఱకుఁ దీరఁగలవని నా విశ్వాసము.”

అని తలఁచుచు వెళ్లుచుండెను. వెనువైపున నుండి వచ్చు వ్యక్తి ముందుఁ బోవుచుండు వ్యక్తియొక్క శిరమ్ముపైఁ దన చేతనుండు కఱ్ఱతో నొక దెబ్బవైచెను. ‘హా’ యని యఱచుచు దెబ్బతినిన వ్యక్తి క్రిందఁబడెను. ఇంతలోన మఱి యొక వ్యక్తి కఱ్ఱ బూనియుండు వ్యక్తికి వెనువైపుననుండివచ్చి భుజముల రెంటిం బట్టికొని. బంధించెను. బాధములనుండి తప్పించికొనుటకావ్యక్తియుఁ బ్రయత్నించెను. ఇట్లావ్యక్తి ద్వయమును పెనఁగు లాడుచుండ దెబ్బతినిన వ్యక్తియుఁ దిన్నఁగలేచి బంధించిన వ్యక్తికిఁ దోడ్పడెను. బంధితవ్యక్తియు నీ వ్యక్తి యుగ్మమును మీఱఁజాలక తూష్ణీం భావ మవలంబించెను.



## ఏడవ ప్రకరణము.

### పండిత సమ్మేళనము.

వింధ్యారణ్య మనేక మృగశరణ్యమై, యత్యున్నత తరుగణ పరిశోభితమై, మునిరాజ విరాజితమై యొప్పుచుండెను. అందొక్కెడఁ బర్ణ కుటీరములనుండెడి బ్రాహ్మణు లొనర్చు వేదఘోషము శ్రవణానంద సందాయకమైయుండెను. వేఱొక వైపుఁ బర్వత గుహాలలోనుండు బౌద్ధ భిక్షువులు లోకుల నుద్ధరింప బౌద్ధమత ధర్మముల నుపదేశించుచుండిరి. నుఱియొక ప్రదేశమున వాత పూరితములగు కీచకములు మురళీ నాదములు సేయుచుండ, నందున కందగునటులఁ బికములు పాటలు బాడుచుండ, నా గానా నుగుణముగ గజములు నిజకర్ణములఁ దాళక్రియలు సల్పుచుండ, నా తాళాను సరణముగ వన మయూరములు నృత్యము చేయుచు నుండనది యొక నాటక రంగమును బోలియుండెను. కొండ చఱియలనుండి వెండితుం పరలవలె నీరు క్రిందఁ బడుచుండ నా వేగపు టొరయికచేఁ గల్గినరేఖ నయనపర్వ మగుచు, కఠినమైనను నిర్వేగమగు శిలా ప్రదేశమునకన్నను, మృదువైనను వేగాధిక్యముగల జల ప్రపాత శక్తి యధికమగుట నిశ్శంకముగఁ దెలియనగు చుండెను. అచ్చటి గాలి యత్యంత సుఖస్పర్శమై, యలసిన వారి యంతరంగమువఱకు వ్యాపించియున్న తాపము నుపశమింపఁజేయు పటిమం గల్గియుండెను.

ఆ ప్రదేశమునఁగల తాపస కుటీరములలో నొక్కటి యించుక విశాలముగ నుండెను. అందొక, బౌద్ధ భిక్షువు

వసించుచుండెను. అతని యాకార మాతని శాంత మూర్తిత్వమును వెల్లడించుచుండెను. సర్వసంగ పరిత్యాగి యగు నా యతివరుఁడించుక దుఃఖతుఁడయ్యు నన్యుల కెఱుకపడని లాగు నఁబై పై నుదయించు వ్యసన సూచక చిహ్నములఁ గప్పి పుచ్చుచుండెను. ఆ మహాత్ముని చుట్టు ననేకులు పండితులు ఆసీనులై యుండిరి. కొందఱు వేదవేదాంగ పారగులై, యష్టాంగ యోగముల నాచరించు వాన ప్రస్థులును; కొందఱు ముక్త సంగులై, పరబ్రహ్మానుభవము సేయుచుండు పరివ్రాజకులును; గొందఱు శాంతులై, యహింసయే పరమ ధర్మముగాఁగొనిన బౌద్ధ భిక్షువులును; ఇట్లనేకులు విద్వాంసులు గుంపులు గుంపులుగ నటనుండిరి. ఆ బౌద్ధ భిక్షువును, కొందఱకు ధర్మ సంశయ నివారణము సేయుచుఁ, గొంఱతో మత ధర్మములఁ జర్చించుచుఁ, గొందఱతోడ నిష్టకథా గోష్ఠిసల్పుచు;

"పండితోత్తములార! యజ్ఞాచరణమును గుఱించి నిన్న భట్టోజీ దీక్షితుల వారానతిచ్చిన విషయమున మీరేమని సిద్ధాంతీకరించితిరి?"

సుగతుఁడు:—అహింసయే పరమధర్మమగుచుండ మనమద్దాని నంగీకరించుట తగదు.

భట్టోజీ:—వేద విహితములగు వాని వారించుట మీకెట్లు సాధ్యమగును?

సుగతుఁడు:—పశు హింసాదులం జేయుమని చెప్పు నా వేదములు మానుష కల్పితములే కాని దైవ సమ్మతములు గావు.

భట్టోజీ:—జ్యోతిష్టోమాదులు వేద విహితములు. యజ్ఞ పశు సంహారణము హింసలోఁ జేరదు. మనకు ముఖ్యప్రమాణము వేదమేయగును. ఇందు సంశయము వలదు. ఆ వేదము లపౌరుషేయములు. దాననే వేదపరిత్యాగి పతితుఁడగును. అట్టివాని సాంగత్య మవశ్య వర్జనీయము.

జినేంద్రుఁడు:—భట్టోజీ దీక్షితుల వారి మాట మెచ్చఁదగినది కాదు. ఋగ్వేదములోని ఋక్కులఁ బరిశీలించిన వారెవ్వరును వేదము లపౌరుషేయములని వాదింపఁ జాలరు. మన శ్శుద్ధిలేక యెట్టి యజ్ఞము లాచరించినను కేవల కాయ క్లేశమున కేయగును. మన యాచరణమే మనల శిక్షింపను రక్షింపను వలంతియగుచుండ ఈశ్వరునిపై భారమువేయుట పొరబాటు. జీవ హింసాదుల వలన నివృత్తులగుటయే స్వర్గాది సాధకము. కావుననే మా వారెల్లఁ జీకటిలో భుజించిన ఎచ్చట జీవహింస కలుగునో యని సూర్యుఁ డస్తంగతుఁడు గాక మున్నే భుజించుచున్నారు. సత్కార్యము లాచరించిన స్వర్గాది సాధకలోకములం జేరఁగలఁడు. దుష్కార్యము లొనర్చినే నరకాది సప్తాధో లోకములఁ బడఁగలఁడు.

సుగతుఁడు:—వేదము లపౌరుషేయములగుట నిర్వివాదాంశము. మన యాచరణమే శిక్షణ రక్షణాదులకు వలంతి యనుటయును యథార్థముకాని సర్వము శూన్యమగుచుండ స్వర్గ నరకాదులు గలవనుట విశ్వసింపఁదగినది కాదు.

భట్టోజీ:—నా పైఁగవియుటకు మాత్రము మీరిర్వురును గలసివచ్చితిరిగాని మీలోఁగలఁ బరస్పరమత భేదముల సవరించికొనలేరు గదా!

సుగతుఁడు:— ఏ భేదమెట్లున్నను న్యాయ సమ్మతమగు దాని నెల్లరు నంగీకరింపవలయును.

భట్టోజీ:—స్వర్గాది లోకములు లేవనుట యించుకైనను న్యాయ సమ్మతములుగావు.

జినేంద్రుఁడు:—భట్టోజీ దీక్షితుల వారాడునది వాస్తవము. ఈ విషయమున నారి మాట యంగీకార్యమయగును.

సుగతుఁడు:—ఈ మీమాంసకులమాట లెన్నటికిని సమ్మఁదగవు. మన కిర్వురకును భేదముగల్పింప వీరూహించుచున్నవారు. ఈ యల్ప భేదముల మన మిటుల వాదులాడుచుండిన శత్రు పక్షము జయమందఁగలదు.

జినేంద్రుఁడు:—అట్లని యన్యాయమున కొడిగట్టుటయా ?

సుగతుఁడు:—మన యిరువుర మతముల కనేకవిషయముల నైకమత్యముగలదు, ఇఁకఁ గొన్నింట నించుక భేదమున్నను వానికి నైకకంఠ్యము గల్గింప ధర్మజ్ఞులు గొందఱు దీక్ష వహించియున్నవారు. దాన నిఁక నిట్టి హింసాకృత్యములఁ ద్రోలఁగింప మన మైక్యము గల్గి యారంభింపవలయును.

జినేంద్రుఁడు:—ఔను. మీ రాడునదియును గొంతవఱకు యథార్థమే.

భట్టోజీ:—అట్లయిన సుగతుని మాటలలోఁ గొంతభాగమే యథార్థము గాఁబోలు!

సుగతుఁడు:—సత్యాసత్య పరిజ్ఞానమున మీకు నైపుణ్యము చాలదు. ఇట్టివారితోఁ మాటలాడుట కన్నమౌన మవలంబించుట మేలని తలఁచెదన.

భట్టోజీ:—"శేషం కోపేన పూరయేత్" అను న్యాయమును జ్ఞానపూర్వకముగ వెలిబుచ్చుచుంటిరే!

జ్ఞానేంద్రుఁడు:—సుగతుఁడు సత్యమునే వచించెను గాని కోపమునే మాత్రమును జూపలేదు. కావున మీరిట్లాడుట తగదు.

భట్టోజీ:—నీపైఁగల యభిమానమున నేనిట్లాడినంతకు నన్నే దూషించుచుంటివిగా! ఇట్టి వానిపైఁ బ్రీతినునిచినది నా లోపమేయగును.

సుగతుఁడు:—న్యాయ సమ్మతమగు దాని వచింపువారినెల్లరును ప్రేమింతురు. ఇంక నీ యట్టి యసూయాపరులు ప్రేమింపకున్న నాతని కేమిలోటు?

బౌద్ధభిక్షువు:—ఆర్యులార! మీరిట్లేల యకారణ కలహమునకుఁ గాలు ద్రవ్వెదరు? ఎచ్చట ధర్మముగలదో యచ్చట జయము గల్గుట నిక్కువము.

అని నాఁటి సమ్మేళనము చాలించి యెల్లరును వారి వారి కుటీరముల కరిగిరి.



# ఎనిమిదవ ప్రకరణము.

## ఆశాభంగము.

---

మంత్రీ! జయచంద్ర చంద్రకేతువు లింకను రామికిఁ గారణమేమియో తెలియరాకున్నది. మన లేఖ కార్యమును కొనసాగింప నేరక వ్యర్థమైయుండునా? లేక మార్గమున వారి కేమైన నపాయము గలిగియుండునా?

మంత్రి:—శశాంక గుప్త మహారాజా! జయ చంద్రునిపరాక్రమము మనకుఁ గ్రొత్తకాదు. చంద్రకేతుని వంచనాపై దగ్ధియు మన మెఱిఁగియే యున్నవారము. వారికేల యపాయము నాటిలును? మీకుఁ గల యాత్మ్రంత్య మిట్లు సంశయముల పాలుసేయుచున్నది.

శశాం:—అట్లయిన నింత కాల మాలసింపఁగత మేమని వచింతువు?

మంత్రి:—వారూరు వెడలి యొక్క వారముకదా యాయెను! ఇంతలోన మీరింత త్వరపడినవెట్లు? నేఁడో రేపో రాఁగలరు. కావునఁ గొంత యోపిక పట్టియుండిన మేలగును.

శశాం:—కార్య మెట్లగునో యను సంశయమొక్కటి దక్క వేఱుచింత లేదు.

మంత్రి:—తప్పక యను కూలించునుగాన మీరా చింతమాని యుండనగును.

అని యిటు వీరు మాటలాడుచుండ సేవకుఁ డొకఁడు వచ్చి రాజునకు నమస్కరించి జయచంద్ర చంద్ర

కేతువులొక్క సవారితోడవచ్చి ద్వారము కడవేచి యుండుట విన్నవించెను.

శశాం:—సేవకా! వచ్చిన యాసవారిని నాయంతి పురమున కంపి, అతని నిటకు రమ్మని యాజ్ఞాపించితిననుము.

సేవకుఁడు:—చిత్తము.

అని యాభటుఁడరిగినంతనే శశాంక గుప్తుఁ డిట్లని తలంపఁజొచ్చెను.

"ఇప్పుడుకదా నే నదృష్టవంతుఁడను! మాళవాధిపతికి నసాధ్యమగు కార్యమును ఏకష్టమును లేక యవలీలఁగా సాధింపఁ గలిగితిని. హర్షవర్ధన ముద్రాంకితమగు నాలేఖాసృష్టి సార్థకమయ్యెను. ఇది మొదలు నా కదృష్టము పట్టినది. కావున రాజ్యవర్ధనుని సంహరించినట్లు హర్షునిఁగూడ నశింపఁ జేసినచో స్థానేశ్వర కన్యాకుబ్జ రాజ్యములు రెండును అస్మద్వశ గతములగును. అభర్తృకమగు మాళవ రాజ్యమును నా యధీనమయగును. అంత నగతికయగు రాజ్యశ్రీ నన్నుఁ బరి గ్రహింపగలదు."

అని యిట్లు తలఁచుచు నానంద పరవశుఁడై యుండునా శశాంక గుప్తుని మ్రోల జయచంద్ర చంద్ర కేతువులు వచ్చి నిలచిరి. వచ్చిన వారాతనికి నమస్కరించిరి. రాజును వారల నుచితాసనముల నాసీనులం జేసి;

శశాం:—జయచంద్రా! ఇంతటి కాల యాపనకుఁ గారణ మేమి?

జయ:—వట్టిమాటలకును గార్య సాధనమునకును జాలయంత రముగల దనుట మున్నే యాడియుంటినిగాదె!

శశాం:—అట్లయిన మన భీముఁడు వ్యర్థుఁడని నీ మతము గాఁబోలు!

జయ:—అయ్యదినేఁ జెప్పనక్కఱలేకయే దేవర వారికి విశద మయియుండునుగాదె!

శశాం:—హర్షునియొద్ద నమ్మిన బంటువలెనుండి యాతని యెఱుకలేక యా ముద్రాంకిత పత్రికను సంపాదింప కున్న నీ కార్యమెట్లు కొనసాగియుండఁగలదు?

చంద్ర:—విశ్వసించినవారిని మోసపుచ్చుట యొక గొప్ప కార్యముకాదు. నూతన స్థలమున కేఁగి, యచ్చటి జనుల మనస్థితులిట్టివని యెఱుఁగరానప్పుడు, వారి వశము గావించికొని, మనయం దత్యంత ద్వేషము గల్గియుండు నొక వనితను; దానికిష్టములేని కార్య మునం బ్రవర్తింపఁజేయ నిట్లుబహిరంగముగాఁ జెచ్చుట సులభమాయనుట దేవరవా రాలోచించినచోఁ దేటఁ బడఁగలదు. అంతటి కార్యమును సాధించిన నాకీలేఖ లేకుండిన నేమిలోటు? అప్పటి కుచిత మగురీతిం బ్రవర్తించి యుండునుగాని యూరక మరలుదునే?

శశాం:—సరిసరి. ఇప్పుడా ప్రసంగములతోఁ బనియేమి? ఎట్లో కార్యము కొనసాగించికొని వచ్చినందునకు సంతసించి తిని. నీ యా యుపకృతిని నేనెన్నటికిని మఱవను.

అని యంతనప్పటి రాజకీయ వ్యవహారముల నంతయు మంత్రిని విచారించవలసినట్లానతిచ్చి వెంటనే యంతఃపురమున కేఁగెను. పోవునప్పుడు తన కత్యంత ప్రీతిపాత్రుఁడై యవ సరము గల్గినప్పు డంతఃపురమునకు వచ్చుచుండు నీ జయ

చంద్రుంగూడఁ దన వెంటం బిలిచికొని వెళ్లెను. అంతి పురము నందలి పరిచారికల మూలమున నూత్నముగ వచ్చిన యామె విడిదిం దెలిసికొని యటకేఁగెను. జయచంద్రుఁడు మాత్ర మీవల నిలచియుండెను. లోనం బ్రవేశించిన రాజును దన మ్రోల నవనతముఖియై నిలచియుండు నా నారీరత్నముం గాంచి చిత్ర ప్రతిమంబోలె నిశ్చేష్టితుఁడాయెను. ఆతని మానసము మాత్ర మామెతో ననుభవించవలసిన సుఖ విధానముల నెల్ల నెన్నుచుండెను. ఇట్లాకాశ హర్మ్యాంబుల నిర్మించుచుండు నాతని చిత్తమున నొక్కెడ భీతియు, నొక్కవైపునఁ బ్రీతియుఁ గల్గుచుండెను. అప్పుడాతఁ డీతీరునఁ జింతింపఁ దొడఁగెను.

"ఇట్టి నారీరత్నమును సృష్టించిన యాధాత కౌశలమేమన వచ్చును? కాకి ముక్కునకు దొండపండా యను నట్లీమోహనాంగిని ఆగ్రహవర్మ కొసఁగిన ప్రభాకర వర్ధనుఁ డెంతయు మూఢుఁడుగాక తెలివిగలవాఁడా! ఇట్టి సుందరితోడ నానందిప నా యట్టివానికింగదా తగును? కావుననే దైవమిట్లను కూలించెను.

ఒక్కవేళ చేతి కందినది నోటి కందకుండునో! హర్షవర్ధనుని గడతేర్చువఱకీమె యబ్బియు లేనట్లే తలంపవలయును. వానిం జంపుట యంత సులభముకాదు. వంచించి చంపుద మన్నను మాయల నారి తేటిన యాతఁడంత చులకనగా లోఁబడఁడు. ఇంతకు వానిం దలఁచునప్పుడే యంగములు వడంకుచున్నయవి. అయినను ఈ నారీ శిరోమణిం గాంచిన దాదిగ నా మనసేమో యుత్సాహ పరిపూరితమగుచున్నది. అదిగాక యిట్టి హర్షవర్ధనుల వేయిమందినైనం బరిమార్పఁగల

యంతటి బలమునిచ్చుచున్నది. ఈ సమయమున నాతఁడు వచ్చిన నొక్క ముష్టిఘాతముతోడనె వాని యమసదనమునకంపఁగలను. నిక్కముగ నేనంతటి వాఁడనగానిచో శూరవనిత యగు నీవిట్టి నన్నెట్లువలచును ?

అయినను బరమ సాధ్వీమతల్లియగు నీమె యెడ నిట్టి కార్య మాచరింపఁదగునా? అట్లని, చాలింతమన్నను ఆమె సౌందర్య మహాకార్యమునకు నన్నోడఁబఱచుట లేదు. ఆఁ! ఆఁ! ఇది తగదు. తగదు. ఈబిడతోడ నా యపరాధముల విన్నవించి అట్టి యకార్యాచరణమునకుఁ గారణ మీ రాజ్యమదమే కావున దాని నీను కర్పించి నేనడవుల పాలై తపమాచరించుచుందును. ఇదియే యుచితమగును.

ఇసీ! ఇదియేమి విపరీత బుద్ధి! సర్వ సుఖముల ననుభవింప విధి నన్ను బ్రేరేపించుచుండ నేనేల యిట్టులఁ దలఁపవలయును? ఈమెం బరిగ్రహించి పరమానందము నందెదను."

రాజ్యత్రయములకును రాజై చక్రవర్తి బిరుదము ధరించి యఖండైశ్వర్యములకధిపతుఁగ వలయుఁగాని యేల యీ నీచపు టాలోచన"

అని తన మది నిట్లొక తీరునకుఁ దెచ్చికొని యాయింతింజూచి.

శశాం:—వనితామణీ! నా సేనలు మార్గమున నీకెట్టి యిక్కట్టునుఁ గల్గనీక జాగ్రత్తగాఁ గొనివచ్చెనా?

స్త్రీ:—ధైర్య సహాయునైన నను గాపాడికొనుట కొరుల సాయము గోరుదానఁగాను.

శశాం:—బాలికా రత్నమా! నీవు స[illegible]వని తలంతు.

స్త్రీ:—మాటలలో ననుటచేం జేతలం[illegible] ననుమి[illegible] [illegible] చితివే! ఓహో! మాయో[illegible]పాయములచే [illegible] జంపునంతటి సామర్థ్యము నాకుం జాలు[illegible] [illegible] చుంటివి కాంబోలు!

శశాం:—[illegible]తా! నీ జాణ తన మే[illegible]గు[illegible]. ని బాధ విముక్తి యొనరించి నిర్బంధము [illegible] నాయం[illegible] నీ వెంతయుం గృతజ్ఞురాలవు గా[illegible]యును.

స్త్రీ:—మాయజాబు నంపినందున నా కేం గృతజ్ఞ[illegible]?

శశాం:—అది మాయ జాబెట్లగును.

స్త్రీ:—ఔనౌను. అది మాయజాబు కా[illegible]! నారాయణా[illegible] కితమగు జాబు.

శశాం:—అది మాయా ముద్రాంకి[illegible] నే [illegible] జెప్పుచున్నాను. ఇది సత్యము.

స్త్రీ:—ఒకని యెఱుక లేకుండ వాని ముద్రిచే [illegible] జాబు బయల్పడుట మాయగాకున్న మఱే[illegible]గును?

శశాం:—నేనట్టి నీచపు బని సేయలే[illegible]. అ[illegible] నీ[illegible]చే వ్రాయంబడిన పత్రికయే యగును.

స్త్రీ:—నీ కన్న నాకన్న యెఱుంగుగలండా?

శశాం:—నినుం బ్రేమించినవారుం [illegible]రా?

స్త్రీ:—అన్నకు సోదరిపైం బ్రేమ లేకుండునే?

శశాం:—సరిసరి. అది యటుండనిమ్ము. నీ యగ్రజు నొద్ద నుండి యీ పత్రికను రప్పింప నే నెంతటి కష్టము నొందితినో యనుటం దెలియక నీవిట్లాడుటుచితముగాదు.

స్త్రీ:—నాకగ్రజుండే లేండు.

శశాం:—హర్షవర్ధనుండు నీ యన్నకదా!

స్త్రీ

శశాం:—రాజ్యశ్రీ! నీ పలుకు నాకు విస్మయము గల్గించు చున్నది.

స్త్రీ:—రాజ్యశ్రీకి హర్షవర్ధనుండన్నయైన నాకేమి సంబంధము కలదు?

శశాం:—నీవు నిక్కముగ రాజ్యశ్రీవి గావా!

స్త్రీ:—నేను నిక్కముగ రాజ్యశ్రీనిగాను.

శశాం:—అయిన నీవెవ్వతెవు?

స్త్రీ:—మాయ రాజ్యశ్రీ నగుదును.

శశాం:—నీ మాటలు నాకర్థమగుటలేదు.

స్త్రీ:—మాయ జాబుం బంపినందునకు మాయ రాజ్యశ్రీ నీ యింటందిగంబడెను. ఇప్పుడైన నీ కర్థమగుచున్నదే!

శశాం:—అట్లయిన నీ వెవ్వతెవు?

స్త్రీ:—నే నెవ్వతెనని తెలిసికొంటివి.

శశాం:—నీవు రాజ్యశ్రీయని తెలిసి కొంటిని.

స్త్రీ:—అట్లయిన సరియే!

శశాం:—నీవింతకు మున్ను రాజ్యశ్రీ కానని నచియించి యుంటివికదా!

స్త్రీ:—చెప్పియుంటిని.

శశాం:—మరల నాదునని యెట్లంటివి?

స్త్రీ:—అభిప్రాయ భేదముచే నట్లాడవలసివచ్చెను.

శశాం:—అదెట్లు?

స్త్రీ:—నీ యభిప్రాయము చొప్పున రాజ్యశ్రీ నగుటయు నాయభిప్రాయమున నట్టులఁ గాకుండుటయుం గల్గుటచే నటంటిని.

శశాం:—నిక్కముగ నీ వెవ్వతెవో తెలుపుము.

స్త్రీ:—నేఁ జెప్పినను నను నీవు తెలిసికొనలేవు.

శశాం:—నే నేల తెలిసికొనలేను.

స్త్రీ:—అట్లు తెలిసికొను వాఁడవైనచో నేఁజెప్పకయే తెలిసికొని యుందువు.

శశాం:—నీవింకనిట్లే పల్కుచుండినచో నిను గారాగారమున నునిచి నిర్బంధింతును.

స్త్రీ:—నీ యీ మాటలకేను బెదరుదాననుగాను. నీ వీటికి వచ్చునప్పుడే యన్నిఁటికిని సాహసించియుంటిని.

శశాం:—నిను వేఁడికొనుచున్న వాఁడనుగాన నిక్కము వచింపుము.

స్త్రీ:—సరి. ఇంకఁ జెప్పెద వినుము. నేను రాజ్యశ్రీకిం బరిచారికయగు మంగలికయనుదానను

శశాం:—నీవిట కెట్లు వచ్చితివి?

మంగి:—నే వచ్చిన విధము నను గొనివచ్చిన వారి నడుగుము.

శశాం:—రాజ్యశ్రీ యేమాయెను?

మంగ:—అది నాకును దెలియదు.

అని యీమాటలాలకించిన శశాంకగుప్తునకు రాజ్యశ్రీ చిక్కలేదు కదా యని వ్యసన ముదయించెను. బాబు చెప్పిన నాచేత చిక్కవలసి యుండు మంగలిక, యెట్లు వచ్చెనని యాశ్చర్యము గల్గెను. జయచంద్ర చంద్ర కేతులిది తెలిసియుఁ దన కెఱిఁగింపకుండుటచే క్రోధమతిశయించెను. ఇంక హర్షవర్ధనుఁడు దన్నేమి సేయునో యను భయముత్పన్నమాయెను. ఇట్లు విషాద విస్మయరోష భయములొక్కుమ్మడి నుదయించుటచే నేమి సేయుటకుఁ దోఁచక స్తబ్ధుఁడై కొంతవడి నిలుచుండెను. ఆవల నటనుండి వెడలివచ్చెను. వచ్చువాఁడచ్చట అట్లు ఆశాభంగము గలుగుటచే చింతాలవాలై జయచంద్రుఁ గాంచెను. వానిఁ జూచినంతనే విషాద విస్మయ భయములు బోవుటచేఁ గోప మొక్కటియే శేషించి యుండెను. నేత్రము లెఱ్ఱవారెను. అప్పుడు శశాంకగుప్తు నాకారమును జూచినంత మాత్రముననే జయచంద్రుని గుండియలు జల్లుమనియెను. జరిగినదంతయు వచింపక దాఁచినందునకుఁ బశ్చాత్తప్తుఁడయ్యెను. తన యవివేకమున కెంతయుఁ జింతిలెను. రాజును నిజభటులంజూచి జయచంద్ర చంద్రకేతువులం బాధించి యాస్థానమునకుం గొనిరమ్మని యాజ్ఞాపించెను. మంగలికంగూడఁ గారాగృహమున నుంచ సెలవొసంగెను. తానును జయచంద్ర చంద్రకేతువుల విచారింప నెంచి యాస్థానమండపమునకు వెళ్లెను.

## తొమ్మిదవ ప్రకరణము.

### కుమారుఁడు.

బాల సూర్యుఁడు దన కిరణముల నచ్చటచ్చటఁ గ్రమ్మించుచు మంచును విదళింపఁజొచ్చెను. శీత బాధకు వెఱచి తలలు బైలు వెట్టకుండిన ప్రాణివర్గ మప్పుడప్పుడే బయలు వెడలుటకు సాహసించెను. గట్టుల నొరయుచుఁ బ్రవహించు గంగా తరంగిణీ వేగాతిశయమునకు భీతిలిన బకములు జలస్తంభన విద్యానిపుణులం బోలె నొయ్యెల్ల నీట నొకవైపునను యుండి, ప్రాతఃకాలమున బైలు వెడలి, యల్పనైశ్వర్యంబు భాతి త్రుళ్లిపడుచుండు మత్స్యముల గ్రహింప నించుక ధైర్యమూనియు శీతబాధకు జంకి వెనుదీయుచుండెను. ప్రాంతారణ్యవాసులగు చెంచు కుఱ్ఱలు కొందఱప్పుడే కట్టెలు దేర నరుగుచుండిరి. ఆతరుణమున గంగాప్రాంత ప్రదేశమునఁ గొన్ని నీట కుటీరము లమరియుండెను. అందొక్క శిబిరమున హర్షవర్ధనుఁడును, కుమారుఁడును, భండియు నాసనోపవిష్టులై యుండిరి.

**హర్ష:**—కుమారా! నీచేసిన గ...యునకే నేఁటియు నలరినాఁడను. నీయంపిన శ్వేతచ్ఛత్రము నిన్నెప్పుడును మఱపునకు రానీదు.

**కుమా:**—మిత్రమా! నాచేసిన దల్పమైనను దానిఁ గొండంతగా భావించి నీవిట్లు పొగడుటకునే మిగుల లజ్జితుఁడనగుచున్నాను. వంగదేశాధీశునకును నాకును యుద్ధము

దిటస్థించ బోవుచుంటిని. ఇందు నా సైన్యసహాయము కొంతచేసి సంతుష్టిం బొందనెంచుచున్నాను. నా వేడికోలును నీవు చెల్లించునని నమ్మియున్నాఁడను.

హర్ష:—నాకుండునట్టి సేన లేయమితములగుటచే ఆవిషయమున నీసాయ మవసరముండదు. ఇంక వేఱొక విషయమున నీ తోడ్పాటు మిక్కిలి యావశ్యకమగుచున్నది.

కుమా:—ఏలాగునైనను నీకుం దోడ్పడవలసిన దనుటయే నాకోర్కి. కాఁబట్టి యది యెట్టిదియో యెఱిఁగించినచో నేనాచరింప సంసిద్ధుఁడను.

హర్ష:—శత్రువు లెప్పుడును మూషికముల భంగి రంధ్రాన్వేషులు. కావున నానీచ శశాంక గుప్తుఁడు నేనూరలేని తఱి నిదియేయదనని యెంచి తనవారి మూలమునం గుట్ర లేవే నాచరింప నోవును. ప్రజలెల్లరు రాజభక్తిపూరితులేయైనను "నబోధ నాత్పరాశక్తిః" అనునటుల దుర్బోధనలఁ గావించి యేరినేఁ దనవశము గావించికొని యేమైన నకార్యము నాచరింప గడంగునో యని యించుక సంశయించుచున్నాను. కావున నీవచ్చటి కరిగి యట్టి వెవ్వేనుండిన వాని నణఁచ వలయునని కోరుచున్నాఁడను. భండితోడం గూడి నేనేఁగి యానీచుం బరిమార్చెదను.

కుమా:—ఆజ్ఞా ప్రతీక్షీసగు నన్నింత వేఁడికొన వలయునే? నీయిచ్చకు మాఱాడువా రిచట నేరుగలరు? అటులే గావించెదను.

అని యిట్టువీరు మాటలాడుచుండఁగఁ గన్యాకుబ్జమున నుండి యొక్కఁడరుదెంచెను. వచ్చినవాఁడు హర్షునకు సమస్కరించి యిట్లనెను.

"దేవా! తావక ముద్రాంకితమగు నొకలేఖఁ గొని వచ్చి శశాంక గుప్త ననుచరు లిర్వురు రాజ్య శ్రీదేవిగారిని చెఱనుండి తప్పించిరి. అంత వైదేశికుండొకఁడు దైవ బలమను కూలమగుటచే నిది మాయా లేఖయని తెలిసికొని యతనికిఁ బరిచిత పూర్వయగు రాజాంతః పుర పరిచారికయగు మంగలిక యను నాబిడ కెఱిఁగించెను. ఆమెయు యుక్తిచే దేవిగారిని శశాంక గుప్తుని పాలుగాకుండ రక్షించెను. ఈవిషయము దేవరవారి కెఱుకపఱచ వలసినట్లు ఆవైదేశికుఁడు నను బంపుటచే నేనిట కరుగుదెంచితిని."

హర్ష:—ఆవైదేశికుఁడెవ్వఁడో నీకుఁదెలియునా?

"నాకును వానికిని భేదము లేదు."

హర్ష:—ఓయకారణ మిత్రమా! నీమాటల యర్థమును గ్రహించితిని. ఇంక నీయునికి మనుకులం దెల్పి నాయుత్కంఠను తగ్గింపుము.

"అట్లే తెలిపెద వినుఁడు," "ఆర్యా! ఉజ్జయినీనగరవాసియగు గాలవుఁడను బ్రాహ్మణుఁడను. మాళవనాథుని కపటము కీర్తిశేషుఁడైన గృహావర్మ మహారాజునకు నెఱింగింప నేతెంచినవాఁడ. మార్గమధ్యమునఁ జోరులకుఁ జిక్కుటచే నట్టి సత్కార్యముం జేయనోచికొనక పోతిని. ఆ తస్కరులు నాప్రాణముల నిజదేవతకుం బలి యీయ నుంకించుచుండు తఱి ఈమహానుభావుఁడు

భండినను రక్షించుటచే ఈమాత్రమైనఁ జేయఁగలితి. ఆహా ! ఈతని యద్భుత శౌర్యము వాచామ గోచరము."

హర్ష:—బావా ! నీవొనర్చిన చోర సంహారముం దెల్పితివి కాని యీయార్త రక్షణ మహాకార్యముం జెప్పవైతివి. అయ్యాదిస్వోత్కర్ష ప్రకటనరూప మని యెంచితివి కాఁబోలు ! ఆహా ! నీశీలముం గన్న నాకెంతయు నానందము గల్గుచున్నది !

కుమా:—రాజభక్తి పరాయణత్వమునకుఁ దోడుగ నీవినయము నబ్బియుండుట బంగరు పూవునకుఁ దావి యబ్బినట్లగుచున్నది.

భండి:—రాజేంద్రా ! మీమెప్పువడయఁజాలునంతటి పని నేనేమియు నాచరించిన వాఁడనఁ గాను. ఇది సామాన్యమగునదనియే నేనెంచెదను.

గాల:—ఆతరుణమున నీతఁడు రాని యెడల వారి దేవతకు నేఁబలి గావలసి యుండును. ఈమహామహుని మూలముననే గ్రహవర్మ మరణించుటయు రాజ్యశ్రీ చెఱనుండుటయుఁ దెలిసెను. అంత విషాదము నొంది యెట్లైన నామెను చెఱనుండి తప్పింప నెంచి కన్యాకుబ్జమునకుఁ బోవుచుంటిని. మార్గ మధ్యమున నిర్వురు యువకు లొక మఱ్ఱి నీడం గూర్చుండి రహస్యాలాపములు సేయుచుండిరి. ఇంచుక దూరమున నుండు పొదయందుండిన నే నది యాలించితిని. దాన శశాంక

గుప్తుఁడు భవన్ముద్రాంకితమగు పత్రికఁ గల్పించి, తన్మూలమున నామెను జెఱనుండి విడిపించి గౌడ నగర మునకు రప్పించికొన నెంచి నటుల విశదమయ్యెను. అంత మాయూరిదియు రాజాంతఃపుర పరిచారికయు నగు మంగలిక కీయుదంతము చెప్పితిని. ఆమెయు రాణి నాపదనుండి తప్పించుమనట్లు చెప్పెను. మఱు నాఁటి యుదయమున మంగలిక యునికి వట్టున కేసరిగి చూడఁగ నామె లేకుండెను. రాజ్యశ్రీదేవిగారును సెఱనుండి తప్పించికొనిరనియు దెలిసెను. పత్రికా విషయమై సంశయించు నవకాశములకే నీవిషయముం జెప్పితిని. వారియనుమతిచే దేవరవారి కీవృత్తాంతము నివేదింప నిటకుఁ బనివిటిని. దేవిగారు మాత్ర మెచ్చ టనో దాఁగి యున్నవారని తోఁచెడిని.

**హర్ష:**—నీచేసిన యీయుపకారమునకు నీకెంతయు సంత సించితిని. ఇట్టి రాజభక్తి యుక్తుఁడు చిక్కుట యెరు దగుటచేనోయీ! గాలవా! నీవెప్పుడును నాయొద్దనే యుండుము. నాయాంతరంగికులలో నొకఁడుగ ని న్నేర్పఱచితిని. భండీ! కుమారా! మీరును నాయి చ్చను గొనసాగింపుఁడు. నేనును గతిపయ పరివార సహితుఁడనై కన్యాకుబ్జమునకరిగి నాసోదరి నన్వే షించెదను.

**భండి:**—దేవా! దేవరవా రల్పపరివారములతో నరుగుట సరియగునా?

హర్ష:—నీకావిషయమున సంశయమక్కఱలేదు. నేనత్యంతము జాగరూకుఁడనై యుండెదను. కావున నావిషయమున సంశయమునందక నాకోర్కె నెఱవేర్చుము.

భండి:—చిత్తము. అట్లే కావించెదను.

హర్ష:—కుమారా! నీవును నామైత్రిం బాటించి నామాట చొప్పున నాచరింపుము.

అని నాఁటి సభ చాలించి యాసనమునుండి దిగి స్నానాదులం గావింప నేఁగెను. తక్కినవారును వారివారి శిబిరములకు వెడలిరి.



# పదియవ ప్రకరణము.

## కరీసకేతు.

ఓరీ! నీచా! జయచంద్రఘాతకా!. నిన్నింత నమ్మి యుండినందున కిది యా ప్రతిఫలము; నీ కే నొనర్చిన యుపకారములకిట్టి ప్రత్యుపకారమా చేయుట! ప్రబలైశ్వర్యముల నిచ్చి, పరమాప్తుఁడవని భావించి, ప్రకృష్ట పదవుల నొసంగిన నాయెడనే యిట్టియకార్యము లాచరించఁ గడఁగినవాఁడ వింక సామాన్యుల యెడ నెట్టి యకార్యములు సల్పకుందువు. నీ యట్టివాని మననిచ్చుటకన్నను బ్రాణములం దీయుట సరియగును. తాఁ జెడ్డ కోఁతి వనమెల్లఁ జెఱిచె. నన్నట్లు నీవు చెడుట గాక చంద్రకేతునింగూడఁ జెడఁగొట్టితివి కాదె!

ఇంతవఱకును చంద్రకేతునివలెఁ సాధువై, విశ్వాసపాత్రుఁడగు బంటుఁడవని తలఁచియుంటిని. తుదకు నమ్మిన వానినే మోసపుచ్చెఁగదా! ఇట్టి విశ్వాసఘాతుకు నూరక విడుచుట పాడిగాదు. ఇంతకును, ఈ విషయమెఱుక వడినంతన మంత్రులు వీరింగడతేర్ప నాజ్ఞాప్రతీక్షు లగుదురు. దాన నీసభయందు వారి కించుక వాక్సహాయము సేయువాఁడును జిక్కఁడు. రాజసభ నీశ్వరుఁడెల్లపుడు నుండుఁ గావున నాతఁడు అన్యాయాచరణమునకుం గడంగిన వీరి యెడ నేరికిని బక్షపాతబుద్ధిం గల్పింపకుండునుగాదె! అట్లయిన నా యొనర్పంబూనిన రాజ్యశ్రీ దేవ్యపహరణమును న్యాయరహితమగునదే కదా! ఆ విషయమునను ఈ సభలోనివారి కాగ్రహము జనింపకుండునే? ఊఁ. అదెట్లు? క్షత్రియున కరాతి నిధనమున్ను అరి ధనాహరణ

మును జేయఁదగినవి. స్త్రీలును జంగమములగు సొత్తులలోఁ జేరినవారు. కాన నా యపహారము న్యాయసమ్మతము. ఇది నిశ్చయము.

అయినను ఇందు జయచంద్రునిది దోషమనియుఁ జంద్రకేతుఁడు ఆతని మాటలకు లోఁబడవలసిన వాఁడగుటచే వాని యందు దోషముండదనియును దోఁచుచున్నది. అట్లని చంద్రకేతువు నిర్దోషియనుటయు సరికాదు. ప్రధానుఁడగు జయచంద్రునందు దోషము పూర్ణముగనుండినను, ఇది యసత్యమని తెలిసియు, వీఁడూరకున్నందున నీతనిపైనను ఇంచుక దోషము కలదు. కావున నిర్దోషియను టెట్లు? ఇఁక నా మాంగలిక నేమి సేయనగును?

ఔరా! ఏమి యీ మాంగలిక యొక్క సౌందర్యము! పరిచారికయే యింతటి రూపవతిగానున్న ఇఁక దీని యజమానురాలెట్టి సౌందర్య రాశిగ నుండవలయును? అట్టి నారీలలామం బొందకుండు, నాజన్మమెందులకు? ఉనికి మనుకులు తెలియనప్పుడు నే నామె నెట్లు పొందఁగలను? ఇట్టి దుర్ఘటమగు కోర్కెం గోరిచేయిఁ జిక్కినదాని విడుతునా? కరస్థమగు నుదకమును పరిహరించి ఘనస్థమగు దాని వాంఛించునంతటి వెఱ్ఱియుందునే! ఇఁక నీమెను మాత్ర మేనెట్లు దక్కించి కొందును? సామమునకు సరిపడునదికాదు. కనకమునకుఁగా మించునదికాదు. బెదరున కదరునదికాదు. దండమునకు జడియునదికాదు. ఇంక దేన దీని లోఁబఱచికొననగును?——సరి. కడకంత్యోపాయమే యుత్కృష్టమగునది.

అయ్యో! కుసుమ కోమలియగు నీ యన్నుల మిన్న యేడ? ఘోరమగు రాజదండన మేడ? పుష్పరాశిలో నగ్నినిడు నట్టిట్టి యక్కటికమున కొడిగట్టుటయా? నే నీ యకార్య మాచరింపంజాల—అట్లని యపరాధముచేసిన వారి దండింపక విడుట దోషముకదా! "అదండ్యుల దండించినను దండ్యుల దండింపకపోయినను రాజపయశముం బొందుటయే కాక నిరయమునుగూడ పొందఁగలఁ"డని శాస్త్రములు ఘోషించుచున్నవి. దోషుల శిక్షింపకున్న ప్రజలలో దోషాచరణ మెక్కుడగును. "రాజా రాష్ట్రకృతంపాపం" అనునట్లా దోషము నన్నుకదా సంక్రమించును!"

అని యిట్టుల గౌడనగరమున రాజసభలో శశాంక గుప్తుఁడు నిండోలగమునుండి యాలోచించుచుండెను. ఈతని మోమున నప్పటి భావముల మార్పుగోచరించుచుండెను. ఇది గాంచిన యచ్చటి యధికారి వర్గమీతని మనశ్చాంచల్యమునకు నప్వాదయించినను లోన నడఁచికొనిరి. ఆకార గుప్తిం జేయఁజాలని వీఁడు నొక ధీరుఁడేయని యెంచికొనిరి. అప్పుడచ్చటి సామాజికులును;

"ఆహా! పెద్దల దినములనుండియును ప్రజలతో నేకీభవించియుండిన యీ రాజకుటుంబమునఁ జనించిన వీని కిట్టి నీచ బుద్ధి యుదయించెనుగా! తన పూర్వుల పేరుఁ జెఱుపుచుఁ, పరమ సాధ్వియని భయమందక, పరకాంతయని పాటింపక, యగతికయని యక్కటికములేక రాజ్యశ్రీ దేవి నపహరింపఁ దలఁచెఁగదా"యని కొందఱును, "వీఁడెంత యన్యాయ మాచ

రింప సమకట్టినను దైవమున కిది ఆ యసమ్మతమగుటచే ఆ కార్యము కొనసాగలేదు. దీననే దేవుఁడొకఁడు గలఁడనుట మన మూహించికొనవచ్చును. ఈ నీచుఁ డేవేవో తలఁచికొని ఆకాశ హార్మ్యముల నిర్మించికొనుచుండెను. తుట్ట తుదకు మంగలికయను పరిచారిక యేకదా వీనికిఁ జిక్కెను! దాసి యగుట వీఁడామె విడిచి పుచ్చనోపు"నని కొందఱును "నీతి విదూరుఁడగు వీఁడు, ఇది రాజకాంత, ఇది పరిచారికయని భేదము పాటించునే! రాజు మెచ్చినది రంభయన్నటుల మోహాంధకార మగ్నుఁడగు వీని కంటికిఁ గానవచ్చిన వారెల్ల సౌందర్య ఖనులేయగుదురు. కావున నామె మాత్రము వీని బారినుండి తప్పు బెట్టు"లని కొందఱును, "రాజ్యశ్రీ విషయమున మేలుసేసిన దైవమిప్పుడు మాత్ర మెచ్చటికిఁబోయెను? ఈమెయు నెట్లే నీ యాపదనుండి తప్పఁగలదని తోఁచెడి" నని కొందఱును, ఇట్లు రాజున కెఱుక పడకుండు లాగున గుసగుసలాడఁ జొచ్చిరి. కొందఱు మాత్రము "ఎగువఁదీసిన బ్రహ్మహత్య, దిగువఁదీసిన శిశుహత్య, యన్నట్లు మనమిం దెద్ది యును బలుకుటకు వీలులే"దనియు, మఱికొంద"ఱుడుమున కూరిలోని పెత్తనమేల, యన్నటుల మనకేల యీ యధిక ప్రసంగ"మనియు నెంచికొనిరి.

సేవ:—దేవర వారి యనుమతి చొప్పున జయచంద్ర చంద్ర కేతువులం దోడ్కొనివచ్చి రాజభటులు ద్వారము కడ వేచియున్న వారలు. ఆనతియైనచోఁ బంపఁగలము.

శశాం:—వారి నిటకు బంపుము.

సేవ:—చిత్తము.

అంత నా సేవకుఁడు వారిని లోనికంపెను. భటుల వెంట నరుదెంచిన యా జయచంద్ర చంద్రకేతువులును రాజునకు నమస్కరించి తలలు వంచికొని నిలచియుండిరి. శశాంకగుప్తుఁడును వారింజూచి.

శశాం:—జయచంద్రా! మిత్రద్రోహి యెట్టి దండనకుఁ బాత్రుఁడో నీ వెఱుఁగుదువా?

జయ:—శిరచ్ఛేదనమునకు పాత్రుఁడగునని తోఁచెడిని.

శశాం:—దానికిం దోడుగ రాజద్రోహమును, అసత్య ప్రవర్తనమును నున్న ఆదండన చాలునది కాదు. కావున నట్టివానికిం జిత్రవధ యుచితమగునదని నామతము.

జయ:—దేవా! దేవర వారి కెదురాడునంతటి శక్తి యుక్తుఁడను గాను. అయినను నాదగు నొక చిన్న విన్నపమును మాత్రమాలకించ వేఁడికొనియెదను.

శశాం:—అదెట్టిదియో తెలుపుము.

జయ:—నాఁడట్లు భవదాజ్ఞం గైకొని కన్యాకుబ్జమునకేఁగి దేవిగారిని బంధవిముక్తం గావించి యామెతోడ మాటలాడుచు వచ్చుచుంటిమి. మిక్కిలి జాగరూకులమై యామెకు సంశయము గల్గకుండు లాగుననుండియు ఆమె యెట్లో మాపై నించుక సంశయించెను గాని యట్లు దాను సందేహించినట్లు వెలికిఁ దోఁచనీక మమ్మత్యంతము విశ్వసించినట్లభినయించెను. దాన మేమును ఆమెపై నొకింత అశ్రద్ధ కల్గియుంటిమి. అదియే యదనని ఆబిడ కాలికి బుద్ధి సెప్పెను. మేము అమె వెన్నంటియే పర్వులిడుచుంటిమి. చంద్రకేతువు

మాత్రము కొంచెము వెనుకఁబడెను. గాఢాంధకార బంధురమగు నానిశీథమున ఆ యూరంగల సందు గొందులనెల్ల ఆమె మముద్రిప్పి యలయించి తా నెచ్చటనో మఱుఁగువడెను.

శశాం:—ఒక్క యబలంబట్టలేని వాఁడవా నాఁడు మహాపురుషునిం బోలె నన్ని ప్రగల్భములం బలికితివి! కఱువనేరని కుక్కకు మొఱుగులు మెండనుట అనుష్ఠానపూర్వముగఁ జూపితివి. బాగు బాగు! నీ శౌర్యము మెచ్చఁ దగినదియే.

చంద్ర:—మేమును ఆ యూరికిం గ్రొత్తవారము. అందును అది యర్ధరాత్రము. అట్లుండ మే మేమిసేయఁ గలమో మీరే యాలోచింపుఁడు.

శశాం:—నిక్కమగు శూరునకుఁ గ్రొత్తయూరని యొకటి కలదా! ఇంతకును ఈయతి జాగరూకుఁడుగ వా ఆమె ననుసరించుచుండిన వాఁడు.

జయ:—అంధకార బంధురమగు నా యర్ధరాత్రమున నెట్టివారైన నేమిసేయఁగలరు? అప్పటి నా స్థానమున నుండి యాలోచించినచో దేవరవారికి అది విశదము కాఁగలదు.

శశాం:—సరి. ఆవలి యుదంతముం దెల్పుము.

జయ:—నే నిట్లగుటకుఁ జింతిలుచుండ వెనువైపుననుండి యరుదెంచిన యొకవనిత తన చేతికఱ్ఱతో నా శిరమున బలముగ మోదెను. నేనును ఆ దెబ్బ కాఁగఁజాలక క్రిందఁబడితిని.

శశాం:—ఒక్క యబలచే దెబ్బలు తినిన పరాక్రమశాలివా? ఆహా! ఎంతటి పౌరుషము!

జయ:—అధిక్షేపవచనము లాడుటకేమి లెండు—ఏమన పాటుననున్నపు డెంత వారికైన సులభముగా భంగము గల్గించవచ్చును. దాననీచుల కాధిక్యము రాఁబోదు. గొప్పవారికి లోటు గలుగఁబోదు.

ఈ మాటలాలకించిన శశాంక గుప్తునకుఁ దా నాచరించిన రాజ్యవర్ధన సంహారము జ్ఞప్తికివచ్చెను. జయచంద్రుఁడును అది కారణముగాఁ జేసికొనియే తన్ని ట్లధిక్షేపించుచున్నవాఁడేమోయని సంశయించెను కాని మహారాజగు తన్నట్లాతఁడు నిందింప సాహసింపఁడని యోచెను. ఘుణాక్షర న్యాయమున ఈ వాక్యము లీతని నోటనుండి వచ్చినవని భావించెను.

శశాం:—ఓయీ! నీ యధిక ప్రసంగమును మాని ఆవలికథ సాగింపుము.

జయ:—అప్పట్టున వెనుకైపుననుండిన చంద్రకేతువట కరుదెంచి ఆమెం బంధించెను.

శశాం:—ఓహో! "గ్రుడ్డిలో మెల్ల • మేల"ను నటుల మీ యనుపురలో నాతఁడు కొంత మెఱుఁగని తోఁచుచున్నది. ఆవల నేమి జరిగెను?

జయ:—మహారాజు లెట్లనినను గాదను వారెవరు?

శశాం:—మరల వెనుకటి పాటయే పాడ నారంభించితివా? అది చాలించి ఎత్తిన విషయమును సాంతముగా వచింపుము.

జయ:—చిత్తము. నేను నించుక సంశయించికొని ఆతనికిఁ దోడ్పడితిని. అంత మే మిర్వుర మామెయే రాజ్యశ్రీ దేవి యని యెంచి ఆమెను సవారియం దునిచికొని అప్పుడే పయనము గావించితిమి. నాఁటి మొదలు నేఁటివఱకు నామె రాజ్యశ్రీ దేవి యనియే ఎంచు చున్నారము.

శశాం:—అయిన నాబిడ రాజ్యశ్రీ కాదనుట మీ రెఱుఁగరా?

చంద్ర:—మే మెట్లెఱుఁగఁగలము? అప్పుడామెఁ జూడఁ బ్రసక్తి యేమి కలదు? అందు నొక దేశమునకు రాణియై, వేఱొక దేశమునకు మహారాజ్ఞి కాఁగల యాబిడను దేఱిచూచుట యైనను మా బోంట్లాచరింపఁ దగినది కాదు.

శశాం:—రాణికిని దాసికిని భేదము గనిపెట్టఁ జాలకుంటిరి కదా!

జయ:—ముందు వెన్కల నెప్పుడును మేము రాజ్యశ్రీనిం జూచిన వారము కాము. చెఱనుండి విడివడిన యా దినమున నైన నర్ధరాత్రమగుటచే నాబిడ ముఖము గాంచిన వారము గాము. మఱియును ఆమె సౌందర్యమున మిన్నయై యుండుటచే రాజ్యశ్రీ దేవి కాదని మే మెట్లూహింపఁ గలుగుదుము?

శశాం:—మీ రేల యామె యునికిమనుకుల విచారింపరైతిరి?

జయ:—మాచేఁ దఱుమఁబడినప్పు డెచ్చటనో దాఁగియుండిన యామెయే మము సంహరింప నెంచి ఈలాగున వచ్చెనని మేమూహించి యుండ సంశయించుటకుఁ గారణమేమి కలదు?

శశాం:—జయచంద్రా! రాజ్యశ్రీ నను వలచి యున్నటుల నీవప్పుడు వచించితివి. అది యసత్యమే కదా!

జయ:—మీ యాజ్ఞ చొప్పున మేము గొనిపోవుచున్న వారమని ఆమెతో నాడి యుంటిమి. అందుల కామెడ మౌన మవలంబించియుండె. దాన "అప్రతిషిద్ధమనుమతం భవతి" యన్నటుల ఆమె యంగీకరించెననియే భావించితిమి.

శశాం:—ఈ జరిగిన వర్తమానము నెల్ల నప్పుడే మాతో నేల చెప్పవైతివి?

జయ: ఏలినవారంతవఱ కోపిక పట్టియుండినం గదా చెప్ప నగును? వచ్చెనని వినినయంతనే పరుగు పరుగున నంతఃపురమున కేగుచుండ ఈ విషయములెల్ల నెఱుక పఱచుట కవకాశమేది?

ఈ మాట లాలకించి నంతనే శశాంక గుప్తునకును వచ్చిన యామె విషయమున నించుక సంశయము జనించెను. ఆమె రాజ్యశ్రీ దేవియే యగునేమో యని యెంచెనుగాని మంగళిక యని స్పష్టముగ చెప్పియుండ నట్టి సంశయము పడుట సమంజసముకాదని యెంచెను. ఆపదనుండి తప్పుటకై అసత్యము పలికియుండునా యని తలంచెనుగాని శుద్ధవంశ జనితయగు రాజ్యశ్రీ యామెయేయైన అట్లు నీచతరోప దాసియని చెప్పికొనదని ఆ సందేహము వలన నివర్తించెను. ఇట్లు కొంతవఱ కాందోళన పడుచుం దుదకుం బరిచారికయగు మంగళికయే కాని ఆమె రాజ్యశ్రీ కాదని నిర్ధారణ చేసికొనెను. వీరికి నించుక మర్మము తెలిసియేయుండును. తప్పును గప్పి పుచ్చ నిట్లసత్యమాడుచున్న వారని యెంచెను.

శశాం:—ఎట్లును మీరీవార్తను నే నడుగునంతవఱకు నాకుఁ దెలుపకుండినది యపరాధముగ నే పరిగణించుచున్నాను.

జయ:—తాము దోషమని యెంచిన మేమేమి బదులాడఁ గలము?

శశాం:—అయిన నంగులకుం దగు శిక్ష ననుభవింపవలదా?

జయ:—దేవర వారు శిక్షింపనున్నచో నెవ్వరడ్డుపడఁగలరు?

శశాం:—నా మాటకై శిక్ష ననుభవింపనున్న వాఁడవేకాని నీపైఁ దప్పుండుట నింకను అంగీకరింపకున్నాఁడవుగా!

జయ:—నే నంగీకరింపక యెచ్చటికిఁ దప్పిపోఁగలను?

శశాం:—సరిసరి. నీతో యుబుసుపోని మాటలాడిన ఫలమేమి? భటులారా! ఈ జయచంద్రుం గొనిపోయి యంధకార బంధురంబగునా గుహా మధ్యమునఁ బడవైచి రెండేసి దినముల కొక్క తూటి ఆహారము పెట్టవలయునని అందలి కావలి వారలతో నుడువుఁడు. చంద్రకేతుని రాజకీయ కారాగారమున కంపుఁడు.

భటులు:—చిత్తము.

అని రాజభటులు జయచంద్ర చంద్రకేతువులం దోడ్కొని చనిరి. శశాంక గుప్తుఁడును మంగళిక విషయమున ఎట్టి శిక్ష విధించుట యని ఆలోచించుచు నాఁటి సభ చాలించెను.



# పదునొకండవ ప్రకరణము.

## ఛత్రం.

---

“మామయ్యా! నీ యాలోచనము నా కిసుమంతయు నచ్చుట లేదు, ఇక్కార్యము సరిపఱచకున్న మా బ్రతుకునకు హానివచ్చునుగదా!.

“అల్లుఁడా! నీ మాటలు నాకీ దినము కనువిప్పు నిచ్చుచున్నవి. నీ వూరినుండివచ్చునప్పుడు నీపతి”—అని యింతలోనన వ్రేలు కఱచికొనెను.

“మామయ్యా! ఇంతలోనన పొరఁబడుటేల?”

“తదేకధ్యానమున నుంటనేనట్లు పల్కితినిగాని యన్యము కాదు”

“ఇట్టి చంచల చిత్తులరగు మీరలా నాకుహితోపదేశ మొనర్చెడివారలు? చాలు చాలు మీ యుపదేశములు.”

“అబ్బాయీ! నన్నంత హీనునిఁగాఁ దలఁపకుము. నీ వూర నుండివచ్చునప్పుడు నీపతిత పావనత్వాది బిరుదముల నేయేటఁ గలిపితివి? నీవిటు మాఱుటకేమి గతమని నేనడుగ వచ్చుచుండ ఇంతలోనన నీ వడ్డపడుటచే ఆ మాట యాఁగిపోయెను.”

“ఇంక మీ ప్రసంగముల మాని నావచనముల కేమి బదులాడెదరు?”

“ఎంత యాలోచించినను అది శుభప్రదమని నామదికిం దోఁచదు. నిదురించు బెబ్బులి మీసములఁబట్టి యూఁగించినట్లగునని తలఁచెదను”

"అట్టిన మీ కొక్క చిత్రముం జూపవలసినటుల నాకాఙ్క్ష యయినది"

"అనెట్టిదియో చూపుము"

"ఇదె చూడుఁడు"

ఆ యువకుఁడు చూపిన యావస్తు వతి సూక్ష్మముగ నుండెను, దానిం జూచినంతన యాతని కిదివఱలోని జాజ్జ్వల్యత్రికి వచ్చెను. అంత గుండె లదురఁజొచ్చెను. ఏమియుఁ దోఁచక తల్లడిల్లెను. పెద్దకొండ యెద్దియో తన తలపైఁబడ నున్నటుల గోచరించెను. ఎదుటివానితో నెద్దియో మాటలాడ నుపక్రమింపఁబోయెనుగాని నోటినుండి మాట వెలువడదాయెను. యువకుఁడు నీతని యప్పటి యవస్థం గనిపెట్టి యిట్టులనియెను.

"మన యిర్వుర యభిప్రాయ మొక్కటైన నిట్టి కష్టము లుండఁ బోవు"

"ఇంక నీవెట్లాడినను నియ్యకొందును"

"మామయ్యా! ఇప్పటికి దారిం బడితిరి. ఇంకఁ దడయుట సరికాదు. భీముఁడును పరాక్రమ కేతువును బంపిన లేఖ నుండి సంజ్ఞల నెల్లం గ్రహించియే యుందురుకదా! వారు నీ యూరనవచ్చియున్నవారు. మీరీ దినమున నర్ధ రాత్రమున నిటకుం గ్రోశమాత్ర దూరముననున్న నాయటవీ మధ్యమునందలి కాళికా దేవాలయమునకు రండు. నేనును వారిం బిలచికొని యట కరుదెంతును."

"నీవాడిన ట్లాయాలయము మనుష్య సంచార శూన్యమగు నది. కావుననది మన రహస్యాలోచనకుం దగినదియ యగును."

అని యొకనాఁటి తెల్లవారు జామున నిర్వురు సంభాషించుచుండిరి. వారిలో నొక్కఁడు దీర్ఘకాయుఁడును గర్వశరీరుఁడు నై బుజ్జ మీసములు గల్గి, ఒకచేతఁ గత్తియు, వేఱొకచేత ధనుర్బాణములును గలిగి యుండెను. అతని యుష్ణీషమును ఆకృతియును జూచిన నాతఁడెవ్వఁడో నొక యధికారి వర్గమునఁ జేరినవాఁడగునట్లు తోఁచుచుండెను. అతని యాకారముఁ జూడ నలుబది వత్సరములవాఁడని గోచరించుచుండెను. అతనితో మాటలాడుచుండిన మఱియొకఁడును నిమ్మపండువంటి మేని ఛాయగలవాఁడును కృశాంగుఁడు నైయుండెను. అతని కింకను మీసము లంకురించ లేదు. అతనిఁ జూడఁ బదునేను వత్సరముల వానిం బోలె గోచరించుచుండెను. వీ రిర్వురును మాటలాడుచుండిన యాస్థలము ఆయూరికడ నున్నడు నొక్క పాడు బడిన యిల్లు. అం దెవ్వరును వసించుట లేదు కాని ఆ యూరం గల జూదరులకు రాత్రులయందు మద్యము నిచ్చుటకై యొక్క గణికా పుత్రుఁ డచ్చటికి వచ్చుట గలదు. ఆకితవులు నామద్య విక్రేతయు రాత్రుల రెండవ యామమున నటకు వచ్చి యొక్క యామకాల మచ్చట నుండుట యలవాటు. నాల్గవ యామమున నేరికిఁ దోఁచినట్లు వారేఁగుచుందురు.

ఆ నాఁడు వార ల్లేగఁగనే యొక యువకుఁ డటకువచ్చెను. వాఁడింకను నుదయము కానందున రాజభట పాలితమగు నా పట్టణమునం బ్రవేశింపక ఆ యింట నించుక యలసట దీర్చుకొనుట కొఱకు దూరెను. అట్టియెడ నా యింటివాకిటి తలుపు చప్పుడగుటచే నాతఁ డొక్క మూలదాఁగియుండెను. వీఁడటనుండుట తెలియక మన కింతకు మున్ను బరిచితులగు

వారిద్వరును బ్రవేశించి మంతనము లాడికొనిరి. ఆ పురుష ద్వయమచ్చటినుండి యరిగినంతన యా యువకుఁడు ఆప్రదేశ మునకువచ్చి యిట్లని చింతించెను.

"ఆహా! నా యీ యాగమనము ప్రయోజన కారి యగున నని తోఁచెడిని. వీరి మాటలు నా కంతగ బోధపడ కుండినను వీరిచ్చట నెద్దియో గొప్ప కుట్రను ఆచరించుటకుఁ బ్రయత్నము సలుపుచున్నవారనుట మాత్రము యథార్థము. ఈ యువకునితో నీతఁడు సంభాషించుచు "నీపతి"యనివా క్రుచ్చి వేలు కఱచికొని, మరల సంబళించికొని "నీ పతితపావనత్వాది గుణము"లని మార్చికొనియెను. దానిచే నారెండవ వ్యక్తి స్త్రీ వ్యక్తియనియే యెంచెదను. ఈవాచసమున కంగీకరింపని యా పెద్దవాఁడు తానాచిత్ర వస్తువును జూచినంతన విస్మితుఁడై అంత భీతిల నేమి కారణము? ఇంతకును ఆ స్థలమునకుఁబోయి చూచినచో నాకేమే నించుక యాధారము దొరుకవచ్చు నిన తోఁచెడిని. పోయి చూచెదనుగాక."

అని యా ప్రదేశమునకు వచ్చెను. అంగీలోనుండిన చెకు ముకి రాతినెత్తెను. దానిపై నించుక ప్రత్తినిడి చేతనుం డిన యినుప ముక్కతోడం గొట్టెను. అందుండి వెడలిన నిప్పు యొక్క వెలుఁగున అచ్చటఁ గ్రిందఁబడియుండు నొక్క బంగరు రేకుంజూచెను. అందేదియో యంత్రము వ్రాయఁబడి యుండెను. దానిం జేత నెత్తికొని చూచి యాశ్చర్య పర వశుఁడై యిట్లని తలఁచెను.

"ఈ రేకు మూలమున నా కేమియుం దెలియుట లేదు. దీనిం జూచినంతన యాతని కంతటి భయమేల కల్గెను? ఇంతకు

ను; ఈ నాఁటి రాత్రి వీరికన్నను ముందుగ నేనాకాళికాలయమున కరిగి దాఁగియున్నచో నన్నియుఁ దెలియఁగలవు. ప్రస్తుత మీ జేకు నిచ్చట విడుచుటయే సాక్షియగును. వారెట్లును దీని కొఱకిటకు వత్తురు. జేకుం గానకున్న సంశయింతురు. దాన దీని నిట దిగ విడిచి తొల్లివలె దాఁగియుండిన వారి సంభాషణలవలన మరల నేమేని దెలిసికొనవచ్చును. వారిటనుండి వెడలునప్పుడు వారి కెఱుక రాకుండ వెనుదవిలిన, వారెచ్చటికిఁ బోయెదరో కనుఁగొన వీలగును.”

అని దానినచ్చట విడిచి యథాప్రకారముగ దాఁగియుండెను. అంతఁ బూర్వపు టిర్వురు నిటకువచ్చిరి. వారును మన యువకునివలెఁ జెకుముకి రాతినుండి నిప్పు గల్పించి దాని మూలమున నా జేకుం జూచిరి. వచ్చిన వారిలో యువకుఁడు దాని నెత్తికొనెను. ఆ వెలుఁగు మూలముననే వీరి ముఖములు ఆ యువకునకుఁ గానుపించెను. ఎచ్చటఁ బిగ్గఱగా నూపిరి విడిచిన వారికిఁ దెలియునో యని తిన్నఁగా నూర్పును విడుచుచుండెను. ఇంచుక కదిలిన నెచ్చటఁ జప్పుడగునో యని, కదలక మెదలకయ యుండెను. అప్పుడచ్చట నా యిర్వురకిట్లు సంభాషణ జరిగెను.

“అబ్బాయీ! ఆ యంత్రము నా యొద్ద నీక నీవేల యెత్తికొంటివి?”

“మీ కిద్దానిం జూపవలయునని మాత్రమే నాకు వారాజ్ఞ యిచ్చియున్నవారలు.”

“అట్లని మొదట నాయొద్ద నిచ్చినవాఁడవేల యడుగకుంటివి?”

"మరలఁ గైకొనుట కొఱకేకదా వెలుపటికి వెడలఁగనే యంత్ర మెచ్చటనని మిమ్మడిగి యుంటిని!"

"ఎచ్చట నని ప్రశ్నించితి వంతియకాని ఇమ్మని యడుగ లేదు కదా!"

"యంత్రము చూపినచో నిట్టిదని మీవలన గ్రహించి ఆవల నిది మీ కీఁదగదని వారి యాజ్ఞయనుటం జెప్ప నెంచితిని."

"నీయుక్తికిం గడు మెచ్చితిని. సంజ్ఞార్థము బంపినది నా యొద్దనుండిన యంతన ఏలోపమును గల్గను. దాన దీని నాయెడనే యుంచుము"

"వారువలదని వారించి యుండ నేనిచ్చినచో నాపని యేమగు నోయనుట విచారింప రై తిరికదా!"

"అట్లైన నది నీ యొద్దనే యుంచికొనుము. నా యొద్దనుండిన దాన నాకగు ప్రయోజనమేమి?"

"అట్లె యొనర్చెదను. తెల్లవాఱుచున్నది. ఇంక శీఘ్రముగ మన యునికి పట్ల కరుగుట యుక్తము"

వీరి సంభాషణ మాలకించిన పూర్వాగతుఁడగు నా యువకునికి సంశయ నివారణ మగుటకుమాఱు ముందరి కంటెను సందేహ మధిక మగుచుండెను. అంత నాతఁడిట్లని యాలోచించెను.

"వీరి మాటల తీరుచూడ నీ బాలుఁ డీయూరివాఁడు కాఁడని తోఁచెడిని. అట్టియెడ వీరి కెట్టిట్టి చుట్టఱికము గల్గి యుండును? వీ రాదినుండియు మామ, అల్లుఁడు నను వరుసలతో బిలిచి కొనుచున్నవారలు. ఈ బాలుని పోలుపు చూడ నాఁడురూపు దోఁచుచుండుటచే కోడలగునో యని

సందేహించెదను. అట్లైన నీతని కుమారుఁ డెవఁడై యుండును? ఏదియు గోచరించుట లేదు. నా కీవిషయ మయోమయముగ నున్నది."

అనియోచి యాతఁడు దత్తావధానుఁడై యుండ నా బాలుఁ డెదుటి వానితో నిట్లనియెను.

"మామయ్యా! మన మనుకొని నట్లు సకాలమునకే ఆ యాలయము నొద్దకు మీరు రావలయును. వారంగీకరించినచో నీ యంత్రమునుగూడ మీకే గ్రహింపవచ్చును."

"యంత్రము మాట యటుండనిమ్ము. ఆతఁడును శబర నాయకుఁడు నిటకువచ్చి రంటివే! వారెచ్చటనున్నవారు?"

"ఆలయము నొద్దకు నెల్లరును రాఁగలరు. అప్పుడే మీ కన్నియు విశదపడఁగలవు."

ఈ మాటలాలించి నంతన మన యువకునకు విస్మయము జనించి యిట్లని యాలోచించెను.

"ఎవ్వఁడా శబర నాయకుఁడు? వింధ్యారణ్యవాసియా! వాఁడైన నియ్యది యసత్యోదంతమగును. వాఁడిట్టి కుట్రలం బ్రవేశింపఁజాలఁడు. ఇంక నెవ్వఁడే నుండవలయు. మఱియు ననిరిష్టనామముగ నాతఁడని యొకని నుడువుచున్నవారు. వాఁడెవ్వఁడయియుండ నోపును? ఇంతకును నేఁటి రాత్రి యట జరిగిన నన్నియు విశదముకాఁగలవు."

అని తలఁచుచుండ నింతలో వారును ఆ యిల్లు విడచి బైలు వెడలిరి. యువకుఁడును వారి కెఱుక రాకుండఁ గొంత దూరమున వారి ననుసరించి పోవుచుండెను.



## పంద్రెండవ ప్రకరణము.

### దుష్ట చతుష్టయము.

ఏ పొదల మాటునఁ జూచినను బెబ్బులుల బొబ్బల కాని అన్యము వినరాకుండెను. ఎటుఁ జూచినను 'ఝం ఝం' మ్మని యొక ధ్వని వినఁబడుచుండెను. ఎట్టి ఖ్యాతిగుండెగల వాఁడైనను ధైర్యముచేసి ఆ యటవిం బ్రవేశింప వీలు గాకుండెను. నగర సమీపమున నున్నను క్రూరజంతు శరణ్యమగు నా యరణ్యము వైపున కేరును నేఁగకుండిరి. రాజు నహింసాపరుఁడగుట వేటాడుటలేదు. దాననచ్చటి సత్వము లప్పటప్పటికి నభివృద్ధిం గాంచుచుండెను. నానావిధ తరులతా వృతమగు నరణ్యాంతార మధ్యమున నొక్కనాఁటి రాత్రి నార్వురు వీరభటు లరుగుచుండిరి. వారిలో నొక్కరుఁ డాజానులంబి బాహుఁడై ముందు వైపున నడుచుచుండెను. అతఁడొక్కచేత వింటిని వేఱొకచేత బాణమును ధరించియుండెను. నడుము నందలి దట్టీయం దొక ఖడ్గపు టొర వ్రేలాడుచుండెను. దాని యందలి ఖడ్గపు పిడి వెండితో నిర్మింపఁబడి యుండెను. వాని ముఖ మతినిర్మలమై స్ఫటికపు జాతివలెఁ దళతళ లాడుచుండెను. కాని యాతని నేత్రములు మాత్ర మాంతరమునఁగల యాగ్రహమును వెలిఁ బుచ్చుచుండెను. తక్కిన వా రాతని యెడ భయ భక్తులు కలిగియుండుటఁ జూడ వారిలో నతఁడే ప్రధానుఁడని తోఁచుచుండెను.

ప్రధా:—ఈ యెదుట గనిపించు నాలయమున బ్రవేశింపుఁడు.

సేవకులలో నొకఁడు. }:—స్వామీ! మన మిటఁ బ్రవేశించుటకుం గారణమేమియో సెలవీఁదగునేని తెల్ప వేఁడెదను.

ప్రధా:—ఇచ్చటి కొక దుష్టచతుష్టయము మంత్రాంగములు గావింప రాఁబోయెడిని.

సేవ:—వారిచ్చట రాఁగలరనుట దేవర వారెట్లు కనిపెట్టితిరి?

ప్రధా:—మన యాప్తుఁడొక్కఁడు దీని నా కెఱిఁగించెను.

సేవ:—వారి దౌష్ట్య మిట్టిదని తెలుపనగునే!

ప్రధా:—రాజకీయమగు నొక కుట్ర జరుప నుద్దేశించియున్న వారు.

సేవ:—అయ్యది యెట్టిదియో తెలియునా?

ప్రధా:—తెలియును గాని యది మీకు క్రమముగ నెఱిఁగించెదను. ఇప్పుడవి యెల్లం జర్చించుచుఁ బ్రొద్దుపుచ్చుచుండుట భావ్యము కాదు. వారును వచ్చు వేళయయ్యెనది. ఆలసింపకుఁడు.

అని ప్రధానుఁడాడినంతన యాలయములోనికి వారేఁగిరి. అయ్యది పాడు బడియుండెను. దాని ముందొక బౌద్ధ స్థూపముండెను. అదియుఁ గొంత విఱుఁగఁబడి యుండెను. దానింజూచినంతన మన ప్రధానున కలవిగాని శోక ముద్భవించెను. ధీరుఁడగుట నాకార గోపనము గావించి యిట్లని చింతింపసాగెను.

"ఆహా! ఎట్టి దాని కెట్టి దశపట్టినది? ఎల్లపుడును బౌద్ధ భిక్షువులు చేరియుండు నీ ప్రదేశ మిప్పు డెట్టిస్థితికి వచ్చెను. శిథిలమగు నీ స్థూపమును జక్కఁ బఱచునట్టి దిక్కు లేనందున

గదా యిట్టి గతిపట్టి యున్నది! కాల మహిమ యనుల్లంఘ నీయము! ఇంక దీనిం జక్కం బెట్టెడి వారెవ్వరో? చేత వెన్న నిడికొని నేతి కల్లాడుచందమున నున్నది! ఇంక నెప్పుడు మనకు మంచిగతి రానున్నదియో యెఱుఁగము.

కాపురములేనియిం డ్లెలుకలు పాడుసేయునట్లుగ రాజు లేని తఱి నిట్టి యకార్యము సేయం బ్రయత్నము గావించుచున్నారు. అగ్నికిం దోడుగ వాయువును జేరునటులం గాలమును వీరికిం దోడ్పడుచున్నది. ధర్మ పక్షపాతియగు దేవుం డొకండు గలండనుట యెప్పుడును మానసమున నెంచకున్నారు."

అని యిట్లు చింతించుచు వారా యాలయములోనం బ్రవేశించిరి. అందు ముందు నైపున నొక్క మండపముండెను. అయ్యది మాత్రము ఇంకను గూలక కూర్చుండుట కనువగు నట్లుండెను. లోపలి భాగమంతయును ఊడ్చువారు లేనందున దుమ్ము నిండియుండెను. ధర్మోపన్యాసకుల కునికి పట్టుగ నుండిన యాలయము ఇప్పుడు ఘూకములకును గబ్బిలములకును నావాసమైయుండెను. అచటి మాలిన్య మధికమైయ సహ్యముగ నుండెను. అచ్చటి మండపమునకుం బడమటి వైపున శిలారూపమగు నొక శివ విగ్రహముండెను. దానికచ్చటం బూజాదులు సేయు వారెవరును లేకుండినను ఎలుకలు తమ కలుగు లోన నిడికొనిన ధాన్య విశేషము లద్దానికి నివేదన కొఱకుం దెచ్చిన పదార్థములాయను నట్లుండెను. సర్పము లావిగ్రహమును జుట్టికొని యుంట నాతని నాగా భరణత్వమును సార్థక పఱచుచుండెను. శిరమున నంటికొనియుండిన బల్లిపర చంద్ర శేఖరత్వమును వెల్లడి సేయుచుండెను. శిథిలిత

మగు విగ్రహామున కించుక యుత్తరమున నొక గది యుండెను. అయ్యది యంధకారమయముగ నుండెను. ఆ గది యందలి కొన్ని స్తంభములు వ్రాలియుంటఁ బై భాగము విఱుగఁబడు టకు సంసిద్ధమైయుండెను. వీరు నచ్చటనే దాఁగియుండిరి. వీరట కరిగిన కొన్ని నిముసముల లోనన నల్వురు పురుషులు ఆ యాలయమున కరుదెంచిరి. వచ్చినవా రామండపముపైఁ గూర్చుండి ఇట్లని సంభాషించుకొనఁ దొడఁగిరి.

"గణ దాసా! ఆమె యింక నిచ్చటనే యున్నట్లు తోఁచుచున్నది. మొన్నటి సాయంసమయమునఁ గీర్తిశేషుఁ డైన పెద్ద మంత్రియొక్క పాడుబడిన యింట నామెం జూచి నట్లు గంభీరవేది నుడివెను."

గణ:—మిత్రగుప్తా! గంభీరవేది యామెం జూచుటకు ప్రసక్తి యేమి?

మిత్ర:—ఇదె గంభీరవేది యెదుటనుండ మనకా చింత యేటికి?

గణ:—గంభీరవేదీ! నీ వామెం జూచుటకుఁ గతమేమి?

గంభీ:—అశరణయగు నొక యబల యన్యదేశముల కెట్లేఁ గును? కాఁబట్టి ఇట నెచ్చట నేనుండునని యెంచి యెల్లె డల వెదకుచుంటిని. కావున నామెం జూచునట్టి ప్రసక్తి కలెను.

గణ:—అట్లైన నీ మాట యింతవఱకును మాకేల తెలుప కుంటివి?

గంభీ:—మీతో మాటలాడ సమయము దటస్థింప లేదు. అట్లుండ నా విషయమెట్లు తెలుపుట?

గణ:—ఇప్పట్టున మన మాచరింపవలసిన కార్యమెయ్యది?

గంభీ:—ఆమెంబట్టి బంధించి శశాంకగుప్తున కర్పింపవలయును.

మిత్ర:—ముందు మన మొనర్చినందున కీతవఱకును బహు మతి యంపనివాని కింకను నుపకృతిసేసిన నేమి యుప యోగము? ఇంత కాలముగ మనపై నేరును సాశ యించుటలేదు. ప్రది దినముల దొంగ యొక్కనాం డైనను జిక్కక పోవఁడు. మన కుట్ర బయల్పడినా నదియే మన కంతకాలమగును.

గణ:—మిత్ర గుప్తుఁడనునది యుక్తతరమగునది. ఎట్లున మన మికార్య మొనర్చుట మేలు కాదు. వ్రతము సెడినను సుఖమైన నుండవలయును గదా! అదియు నిందు శూన్యము. అయినను పాంచాలుని యభిప్రాయ మునుగూడఁ గనుఁగొందము.

పాంచా:—మన మొనర్చిన యది సార్థక మెట్లాయెను? వ్యర్థ కార్యమునకు ప్రతిఫల మపేక్షించుట యేటిపాడి? వంచనకుం దగు పరాభవ మందకునికియే పదివేలు. ఇప్పట్టున నట్లుగాక శ్రద్ధతో కార్య మొనర్తము. దాన లాభము గల్గుటకు లోటులేదు.

గంభీ:—పాంచాలుని మాటలు ఎంతయు మెచ్చఁదగినవి. వాని యిచ్చవొప్పునన ఆచరించినచో మన కెంతయు లాభ ము గలుగును.

గణ:—పాంచాలుఁ డాడిన యట్టుల నిప్పుడు మనము బహూ కృతికిం బాత్రులు గానేరమనియే నాకును దోఁచు చున్నది.

మిత్ర:—అట్లాడనేల? మన కార్యమును చక్కఁగనే యాచరించి యుంటిమి కదా! తన వారివలన నైన లోపమునకు మన మేమిసేయఁ గలము? అద్దియుం గొంతవఱకాతని కనుకూల పరిణామిగనే కదా యాయెను!

పాంచా:—పులి గూఁటినుండి తప్పించి కొనెనుగదా! ఇంకనాతని కనుకూల పరిణామియగు టెట్లు?

మిత్ర:—వస్తువునకు బదులుగ వస్తువు చిక్కియుండ ననుకూల పరిణామిగాదని యెట్లెంచవచ్చును?

గంభీ:—రత్నమును బోఁగొట్టికొనిన వానికి తాళినిచ్చి ఇదియే రత్నమని భావించి కొనుమనునట్లున్నది.

పాంచా:—అదియును దైవ వశమున జరిగినదియే కాని మన ప్రతిభా విశేషమున నైనదికాదుకదా!

గణ:—ఇంక మన మాలసించుట తగదు. శీఘ్రముగ నామెం బట్టి గౌడనగరమున కంపుట భావ్యము.

అను నీ మాటలాలించిన ప్రధాని వీరి యభిప్రాయములు చక్కఁగ నెఱిఁగిన వాఁడై వారిం బాధింప నిజభటుల కానతిచ్చెను. యజమాను నాజ్ఞ చొప్పున వారును తటాలున ఆ దుష్టచతుష్టయముపైఁబడిరి. వారునట్లగునని యెంచినవారు కారు కావున మొట్టమొదట స్తబ్ధులై యుండిరి కాని వీరెవ్వరో చోరులని యెంచి వారి బారినుండి తప్పించికొనుటకై యెన్నియో ప్రయత్నములు గావించిరి. కాని అవెల్ల నుపయోగ శూన్యములాయెను. ప్రధాని ముందు నడచుచుండ నానతని యనుచరులు బంధితులతోడ నా ప్రధాని ననుసరించుచుం

డిరి. ఇట్లు పోవుచుఁ దిన్నగ నగరము చెంతకు రాఁగనే గణదాసుఁ డిట్లని తలఁచెను.

“నే నింతవనుక వీరెవ్వరో చోరులని యోచించుచుంటిని. తస్కరులైన నగరములోని కేల పోవుదురు? వీరిజాడఁ జూడ రాజభటులఁ బోలియున్నది. వీరు మా రహస్య సంభాషణముల నాలకించి యుందురు. దానమాకిఁక కీడు గల్గుట నిశ్చయము.”

అని యాలోచించుచుండ ముందు నడచు నా ప్రధానుఁడు వీరిం జూచి యిట్లనెను.

ప్రధా:—ఓ దుష్టులారా! మీరు ప్రాణములపై నాసయున్న నా ప్రశ్నమునకు సరియగు బదులొసంగుఁడు.

గంభీ:—మే మసత్య మాడము కాని ఒరులకు బాధాకరములగు వాని మాత్ర మెంతమాత్రమును ప్రకటింపఁజాలము.

ప్రధా:—అక్రమము లాచరించుచుండినను మీ యీ యాధ్యవసాయమున కేనెంతయు నలరినాఁడను. దీని సద్విషయమున నుపయోగించిన నెంతయు బాగుండెడిది. మీరాది నెద్దియో యక్రమ మాచరించినట్లు సంభాషించుచుంటిరే, అయ్యది యేదియో వివరించునది.

గంభీ:—అక్రమమని తెలిసియు చెఱనుండి యొక్కరిని విడిపించుటయే మేమాచరించిన యకార్యము. ఇంతకన్న నెక్కుడుగ మే మేమియు నుడువఁజాలము. దాన మము విశ్వసించిన వారి గుట్టు రట్టుసేసి నట్లగును. ఇది సత్యము. మీ రేమి సేసినను సరియే.

ప్రధా:—నేను మాత్రమేమి సేయఁగలవాఁడను? మిమ్మిప్పుడు రాజభటుల పాలు గావించఁ బోయెడివాఁడను. నారెట్లొనర్చినను సరియే.

గంభీ:—మీ చిత్తము.

పిదప ప్రధానుఁడు దన యనుచరులతోడను నా దుష్ట చతుష్టయముతోడను పుర ప్రవేశ మొనరించెను. ద్వారపాలురు వీరింజూచి, సంశయింప ప్రధానుఁడు వారి చెవిలో నేమియో చెప్పెను. వారంత దూరముగఁ దొలఁగి దారి తీసిరి. ఎల్లరును ప్రధానామాత్యుని యింటికి నరిగిరి. ప్రధానుఁడు నమాత్యునితో నా దుష్టచతుష్టయము ఆ యూరం జరిగిన కుట్రకుఁ గారణమనెను. అమాత్యుఁడును వారి బాధ నాగారమున కంపెను. మంత్రి యెంత వేఁడికొనినను ప్రధానుఁడు మాత్రము తన యునికి మనుకులం దెల్పక అంతయుఁ గ్రమముగఁ దెలియునని వచించి తన యనుచరులతోడఁ దత్క్షణమ యెటకో యరిగెను.



## పదమూఁడవ ప్రకరణము.

### పసులకాపరి.

ఒక్కనాఁటి సాయంసమయమున గోదావరీ తీర భూమి యెల్లరకు నానంద ప్రదమైయుండెను. ఆహార గ్రహణమునకై యచ్చటచ్చటి కరిగిన పక్షి జాలములు బిడ్డలం జూడ నువ్విళు లూరుచుఁ దమ తమ గూండ్ల కరుదెంచుచుండెను. పసుల మేఁత కొఱకు బైలునకుం దోలికొని పోయిన గొల్లలు వాని మరలించికొని యూరి వైపునకు వచ్చుచుండిరి. అడనాడ మేయుచుండిన మృగములు తమ పొదలలోనికి వచ్చుచుండెను. చెంచులు కొందఱు బవలెల్లం గొట్టినకట్టెయల నమ్ముకొనుటకై యా కాష్ఠముల మోపు శిరమున నుచికొని వచ్చుచుండిరి. అస్తశిఖరి గతుఁడగు సూర్యుని యరుణకాంతులు వృక్షాగ్రము లపైఁ బ్రసరించి బంగారు పూఁత పూసినట్లుండుచు, చూపఱక మందానంద మొసఁగుచుండెను. అట్టియెడ నా నదీ తీరంబున నొక పాంథుఁ డేఁగుచుండెను. ఎల్లరకు నుత్సాహముం బుట్టించు నా గౌతమీ కల్లోల తుషారములం గూడిన చల్లని గాలి యాతని మానసమును ఆకర్షింపఁ జాలకుండెను. మనోహరముగ తాండవము సల్పు నచ్చటి మయూరములు ఆతని చిత్తమును స్వాయత్త పఱుపఁ జాలకుండెను. ఆతని కించుక దూరమున నొక్క పసులకాపరి తన గోగణముం జోలికొని వచ్చుచు వేణుగానము సేయుచుండెను. ఇంతదనుక నన్యాయత్తముగ నుండిన యాబాటసారి మానసమును ఆ వేణుగాన మాకర్షించెను. ఆతఁడా గానము వినవచ్చెడి వైపునకు దృష్టి మరల్చి యత్యంత సంతుష్టాంత రంగుఁడై;

"ఔరా! సంగీతము యొక్క మహిమను ఏమని గాని యాడఁగలము? ఎట్టి సంకటము లున్నను బోఁగొట్టుట కిది యమోఘభైషజ్యమగుచున్నది. ద్రాక్షారసముం బోలి మాధుర్యమునుగల యీ సంగీతము గానప్రియుఁడగు వానిం బరవశము గావించి వాని శ్రోత్రేంద్రియములకు సుతృప్తిం గల్పించుటలో, ద్రాక్షారసమున కన్నను మిన్నయగును. గానము సేయుచోట ఆయాదిదేవుఁ డంతర్హితుండై యుంట నిది యుత్సాహదాయి యగుట యబ్బురముగాదు, నేయేల? చింతార్ణవగతుఁడనై పారము గానక పరితపించుచు తదేకాయత్త చిత్తుఁడనగు నన్ను నాకర్షించియుండున దీసంగీత శ్రవణమే కదా!—అది యటుండ నిమ్ము. ప్రొద్దు పోవుచున్నయది. నేనీ రాత్రి నెచ్చటనేని విశ్రమింపవలయుఁగదా! ఈతఁ డీ చెంతనుండు పల్లియకుం బోవుచున్నవాఁడు. వీని వెంటంబోయి నేను నా పల్లియ యందీ నిశంగడిపెదను."

అని తలఁచుచుండ నా గొల్లం డీతని చెంత నరుగుదెంచెను. వచ్చినవాఁ డీతనిఁ జూచినంతన భీతుఁడై నిలువఁబడెను. కాలుసేతులు గడ గడ వడంక సాగెను. చేతనుండు వేణువు నాతని కెఱుకరాకయ క్రిందికి జాఱిపడెను. ఇంతలోన తన వృత్తమాతఁ డెఱుంగకుండవలెనని ఇంచుక మఱుఁగు పఱచ నెంచెను. పథికుఁడు నీతని యాతురతం గాంచి కారణ మారయఁజాలక విస్మితుఁడై;

పథి:—గోపాలుఁడా! నీవేల యిట్లకారణ భీతుఁడవగు చున్నవాఁడవు?

ఈ మాటలాలకించిన యా గొల్లపిల్లవాఁడును దానెంత గుప్తముగావింప నెంచియు గుట్టుబయల్పడుటకించుక చింతించి;

పసులకాపరి:—హా! మామయ్యా! నీవానాఁడు క్రిందఁబడిన దాదిగఁ గాన్పింపమిఁ జచ్చితివనిగదా యెంచితిని! నీ గొంతు సవ్వడిం దెలిసికొను నంతవఱకును నే నిను దయ్యమని తలఁచియుంటిని. నీ వెట్లాయాపద నుండి తప్పితివి? నిన్నెవ్వరు గాపాడిరి? ఇన్ని దినములును నీ వెచ్చటనుంటివి? తిన్నఁగ నూరికేఁగక యిచ్చటికివచ్చుట కేమికారణము? నీ సోదరీ మరణము నీకింకను దెలియదుకదా! దానవే దిక్కు లేక నేనీయూర నొక్కని యింటఁ బసులకాపరినై బ్రదుకుచున్నాను.

ఈ మాటలు వినిన పథికుఁడును విస్మితుఁడై యిట్లని వితర్కింపసాగెను.

"ఈ బాలుని గొంతు సవ్వడి మాత్రము మున్ను విన్నట్లు తోఁచెడినిగాని యీతని మాత్ర మెన్నఁడును జూచినట్లు నామదికిఁ బొడఁగట్టుటలేదు. నేను క్రంతనుండి క్రిందికి దూఁకిన దీతఁడెట్లెఱిఁగెనో తెలియరాకున్నది. తనకును నాకు నెద్దియో సంబంధమును గల్పించి యున్నవాఁడు. నన్ను వంచించుట కీ తంత్ర మొనర్చియుండునా? ఆకృతి సామ్యముండినఁ బొరఁబడియుండునా? అట్లైన నాతని యలుకుడు నే మున్ను విన్నదానిం బోలెనున్నది. దీనికిం గతమేమియుండును? లోకమున ధ్వని సామ్యము మాత్రముండదే! దాన నితఁడు పొరవడెననుటయే యుక్తతరము. కావున నీతని సంశయ నివారణము గావింతును."

అని తాను ధరించియుండిన యుడుపుల వీడి తన పూర్వ పుటుడుపుల ధరించెను. ఇది గని యాతఁడిట్లని యెంచెను.

"ఓహో! నేనప్పుడే సంశయించితిని. నా సందేహము స్థిరమైనది. సింహమువాతఁ బడినవాఁ డెట్లు బ్రదికివచ్చెను? ఆహా! వీఁడెంతటి కైనను వెనుదీయువాఁడు కాఁడు." అని తలఁచి;

పసుల:—అయ్యా! నన్ను మన్నింపుము. నేఁ దెలియక పలికితిని.

పథి:—ఇందు మన్నించుటకే మున్నది? నే నన్యదేశవాసిని. కావున నాకీరాత్రి విశ్రమించుటకంత చోటిప్పించినచో నంతియ చాలు.

పసుల:—ఈ పల్లియ యొక బ్రాహ్మణాగ్రహారము. ఇందలి యధికారి యింట నేఁ బసులఁగాచుచున్న వాఁడను. నాకిచట నన్యు లెరును పరిచితులు లేరు. మీరట కరుదెంచినచో వారివసారాలోఁ బరుండవచ్చును. వారును ఇందుల కన్యథా వచింపరు.

పథి:—అట్లే కానిమ్ము.

అంత వారిరువురును ఆ యగ్రహారములోని కరిగిరి. అందొక్క బ్రాహ్మణ గృహముండెను. దాని వాకిట నొక వసారా ప్రాలిచియుండెను. దాని క్రింద మంటి యరుగులు రెండు కట్టఁబడి యుండెను. పసులకాపరియుఁ దనతోడ వచ్చినవాని ద్వారమున కానలన యునిచి తా నా పశువులఁ గొట్టములోనం గట్ట నేఁగెను. యజమానుఁడును ఆ కొట్టము నొద్ద కరుదెంచి యిట్లనెను.

యజ:—కుమారా! నీ వెంట వచ్చిన యాతఁడెవ్వఁడు?

పసుల:—ఆతఁ డెవ్వఁడో వైదేశికుఁడఁట. ఇచటరాత్రి విశ్ర
మింపవలయు నన్న తమతో మనవిసేసి యాతని కీరాత్రి
మన నసారాలోఁ బరుండ నాజ్ఞతీసి యీ వచ్చునని
యెంచి పిలిచికొని వచ్చితి నంతయే కాని యాతని యునికి
మనుకులు నే నెఱుఁగను.

యజ:—అట్లని వాని నిటకుం గొనిరమ్ము.

పసులకాపరియుఁ బశువులం గట్టి ద్వారము నొద్దనుం
డు నా పథికునిఁ దన యజమాను నొద్దకుం బిలిచికొని
వచ్చెను.

యజ:—ఓయీ! నీ వెవ్వఁడవో వైదేశికుఁడయినట్లు మా పసు
లకాపరి మూలమునఁ దెలియనాయెను. కాని నీ పేరు
నూరు నెయ్యవియో తెలుపుము.

పథి:—స్వామీ! ఎచ్చట జీవనము దొరికిన నచ్చట నివ
సించు నా యూ రెద్దియని వచియింపఁగలను? ఎప్పటి
కప్పుడు నాకృత్యములం బట్టి పేరును మాఱుచుండును.
దాన నదియు నెద్దియని తెలుపఁగలవాఁడను?

యజ:—నీ మాటలంబట్టి నీ యునికిమనుకు లొరులకుఁ దెలుప
నిచ్చగించని వానివలె గోచరించుచున్నావు. ఎట్లైనను
సరియే. నీవీ రాత్రినిట యథేచ్ఛముగ విశ్రమించుము.

అని యాడి యజమానుఁడును గార్యవ్యగ్రుఁడై గృహ
ములోని కరిగెను. పసులకాపరియుఁ బసులకుఁ గసవువైచి
యా బాటసారి యొద్దకు వచ్చెను. బాటసారియును పసుల
కాపరితో నిట్లనియెను.

పథి:—ఇచ్చటికి కుత్తరపు వైపుననుండు నాగుడిసె లెవ్వరివి?

పసుల:—అవి యీ యూరం గొలములు దున్నుగాపు వారివి.

పథి:—సరి. నీ యునికిమనుకు లెవ్వి?

పసుల:—నేం దూర్పు సీమ నొక కుగ్రామమునం బుట్టినవాం డను! మా తల్లి మరణించి నందున నిస్సహాయుండనై యచ్చటచ్చటం దిరుగుచు నీ యూరున కరుదెంచితిని. ఇట నీ మహాత్ముండు నా చరిత్రమువిని జాలింగొని నను దన యొద్ద నిలిపికొనియెను.

పథి:—నీవును నావలె నిజ వృత్తాంతము బైలువెట్ట నొంచని వానివలె గోచరించుచున్నాండవు.

పసుల:—అట్లుకాదు. నా చరిత్రము దలంచిన నాకే వ్యసనము గల్గుచున్నది. కావున నేనది సెప్పుటకు వెనుం దీయుచున్నాను.

పథి:—అది యట్లుండనిమ్ము. నీ గొంతు సవ్వడి మాత్ర మీ వఱకు నే విన్నయట్లు తోంచుచున్నది. కాని కారణ మెంత విచారించినను గోచరించుట లేదు. నా కది విస్మయము నిచ్చుచున్నది.

పసుల:—అదిని మీ వేషమును జూచి నే భ్రమ నొందినట్లు మీరును భ్రాంతి వహించి యుండవచ్చునుగాని యన్యముకాదు.

పథి:—నేను నట్లే యెంచితినిగాని అప్పుడప్పుడు సంశయ ముదయించుచును ఆ బుద్ధిని మార్చుచున్నది.

పసుల:—సంశయము కలిగినపుడెల్ల నిట్లే తలంచికొనుచుండిన చో మనసు కుదుటం బడంగలదు.

ఈ మాటలాలించిన మన బాటసారికి సంశయ మింకను బలవడ నారంభించెను. దాన నా గొల్లని నిర్బంధించియైన నాతని వృత్తాంతముం దెలియ నెంచెనుగాని తన మాఱువేస ముంగూడఁ దీసివేసి తాత్త్వికరూపముం ధరించియుంట నెచ్చటఁ దాను బైలు వడవలసివచ్చునో యని యాకార్యమునుండి విరమించెను. ఇంతలోన నా యింటి యజమానురాలు భోజనమునకై పసులకాపరిని బిలుచుటచే నాతఁడు నీతెరువరిని వీడ్కొని వెళ్లెను. అంత నీ బాటసారియు;

"ఇతని గొంతు సవ్వడి యిదివఱలో నే విన్నట్లు దోఁచుటయే కాక ముఖము తీరును దృష్టపూర్వముగ నే గోచరించుచున్నది. ఈతఁడును పూర్వపరిచితునివలె సంభాషించుచున్నాఁడు. నా మాఱువేసముంగూడ వీడ్చియుంటినే! పీఁడిక నా గుట్టు బయల్పడుచునేమో! ఇటనుండి తప్పి వెడలిన నంతియ చాలును. ఏమిసేయుదును? ఎట్లు దప్పించికొనఁగలను? తెలియక యిటఁ జిక్కుకొంటిని. ఎట్లును ఈ రేయి నిటఁ గడపవలసియేయున్నది."

అని తలఁచుచు నా భీతిచే నిదురించక యుండెను. ఇట్లుండ నర్ధరాత్రమువఱ బశ్చిమ దిశనించుక మబ్బు క్రమ్మెను. ఇంతలోన నుత్తరమున నొక మెఱపు మెఱసెను. అంతలోనఁ దూర్పున నొక గాలి వీచి యచ్చటచ్చటం జెదరియుండిన మేఘముల నొక్కటిగాఁ జేర్చెను. ప్రథమమున సన్నని చినుకులతో నారంభించిన వర్షము క్రమ క్రమమున నతిశయించి కుంభములతోఁ గ్రుమ్మరించిన లాగున జడి వానకురియసాగెను. ఎటుఁజూచిన నేకార్ణవముగఁ దోఁచునట్లుండెను. కప్పలును

'బెక బెక'యని యారావము గావించుచుండెను. ఎట్టి ధైర్యవంతునకును చిత్త చాంచల్యము గల్గు భంగి నుఱుములు ఉఱుముచుండినవి. మన బాటసారియు నాచలి కాఁగఁజాలక క్రులేచి మోకాళ్ల బొమ్ము గప్పికొని ఆసీనుఁడై యుండెను.

ఇంతలోనన కొంతవర్షాడంబరము తగ్గఁ జొచ్చెను. అప్పుడా యింటి యజమానుఁడొక తాటియాకు గొడుగుం దాల్చి పసులకాపరి తన వెంట వచ్చుచుండ బయలునకువచ్చి ఆ యూరి కాపుల నెల్లఁ బ్రోవుసేసి చెఱువు నొద్దకుం బిలిచికొని వెడలెను. అప్పటికే నటఁ గలుజుల వెంట నీరు ప్రవహించుచుండెను. కొందఱు కాపులు తాము తెచ్చిన గసవు మోపుల నా కలుజు త్రాళ్ల సడ్డముగ వైచిరి. పైనుండి యింకను వెల్లువ వచ్చుచుండుటఁ గొన్ని త్రాళ్ల సందులు మాత్రము విడిచి తక్కినవాని నెల్ల మూయించెను. మన బాటసారియుఁ దానెప్పుడును బల్లియలలో నివసించినవాఁడు కాఁడు కావున అదియాతనికి వింతగఁ దోఁచుటచే శీతబాధంగూడ లెక్క సేయక వారి వెంటం జని యచ్చటి చర్యలం దిలకించుచుండెను. ఆతని కదియొక యుత్సవమువలెఁ దోఁచుచుండెను. అప్పుడు వర్షము చక్కఁగా వెలిసెను. వెలుతురును గోచరించుచుండెను. అక్కడికి వచ్చిన కాపులలోఁ గొందఱు చేఁపల కొఱకు వలలు వేయువారుగను, గాలములు వేయు వారుగను నుండిరి. పసులకాపరియు యజమానుని తోడ నుండుచుఁ గలుజులకు మోపులు వేయించుట మున్నగు కార్యములయందాసక్తుఁడై యుండెను.

ఆ తరుణమునఁ దూర్పున నించుక తెల్లవాఱెను. కాకులు గూయసాగెను. కోళులును ఇండ్లపై నెక్కి శబ్దింప మొదలిడెను. పాంథుఁడును ఇదియే యదనని యెంచి, వారి కేరికి నెఱుక పడకుండ నటనుండి కదలిచనెను. ఇటుఁ గార్యములెల్లం బూర్తియగుటచేఁ గాపులును వారి వారి యిండ్లకరిగిరి. పసుల కాపరియు నాతని యజమానుఁడు నింటి కరుగుదెంచిరి. పాంథుడు లేనందున యజమానుఁడును నాశ్చర్యపడెను. అప్పుడు పసులకాపరి యిట్లనియెను.

పసుల:—స్వామీ! నా పలుకులు కొంతవఱకు యథార్థమగునని మీ కిప్పుడైనను దోఁచుచున్నదే!

యజ:—ఈ విషయము నీ వెట్లు కనిపెట్టితివి?

పసుల:—మావా రానగరమున గొప్పపసులమంద నిడికొని యున్నవారని మనవిచేసి యుంటినిగదా! వారిం జూడ నేను నప్పుడప్పుడును బోవుట కలదు. ఆ తరుణమున నితని నెన్నియో తడవలు చూచియుంటిని. దాననే వీని గుణములు నాకుం దెలియును.

అని వారిరువురు నిట్లు సంభాషించుచుండి యావల వారి వారి పసుల కరిగిరి.



## పదునాల్గవ ప్రకరణము.

### మంగళిక నైపుణ్యము.

---

వింధ్యారణ్య మధ్యమున నిద్దఱాఁడువాం డ్రొక్క నాఁటి మధ్యాహ్న సమయమున దారి నడచుచుండిరి. వారిలో ముందు నడచు నామె సర్వ లక్షణ శోభితయై యుండెను. ఆమె మనసున దుఃఖమధికముగ నుంట నామె ముఖమును జూచిన వెంటనే విశదమగు లాగున నుండెను. సుందరు లేడ్చి నను నవ్వినట్లే యుండుదనను నటుల నామె మోమునందలి నైవర్ణముగూడ నా యఁగినా మనికొొక తీరగు గాంతి నుత్పా దించుచుండెను. అటులఁ జింతాకుల యగు నామె;

"ఆహా! కాలమెట్టి విపరీత పరిణామి యాయెను! పరా క్రమ నిధికిం బుత్రినై, ప్రతిపక్ష శిక్షకులగువారికిం దోడఁ బుట్టువనై, శూరాతి శూరుఁడగు మహారాజున కిల్లాలనయ్యును ఇప్పు డిట్లుశరణనై కుఁమచున్నదానను. మహాత్ముఁడగు భర్తయే లేనిలతఃనీ వ్యర్థ జీవితమేల? సౌమంగల్య హీనయగుచును ఇట్టి నీచపు బ్రదుకు బ్రదుకుటకన్నను జచ్చుటయ మేలగును. దుఃఖ మాజీవవేదనాకరము. దాన నీబాధ కోర్చుటకన్న క్షణమాత్ర పీడావహమగు మరణ మెంతయు నుత్తమము. పతి ప్రాణమనియును బత్నిశరీరమనియును శాస్త్రములు ఘోషించు చున్నవి. అట్టి యెడ ప్రాణహీనమగు కళేబరము భాతి భర్తృ హీనయగునే జీవించుట యుచితమగునది కాదు."

అని తలఁచుచు నీమె ముందువైపున నడచిపోవుచుండెను. ఈమె కించుక వెనువైపున వచ్చు నామెయు "ఔరా! ఏమి

నా యదృష్టము ! గూఁటినుండి తప్పిన పిట్ట తనంతటన వాలలలోఁజిక్కుకొనియెను. ఈమెకామరణవార్తదెల్పఁగూడదని భావించి దాచికొనియుండియు నాసంకల్పమెల్లను వ్యర్థమాయెను. నాపడినపాటు తెల్లనట్టేటఁ గలిసియులాగున నానీచుఁడు సుదర్శన శర్మ నిన్న నాయగ్రహారమున ఈవిషయముం జెప్పెను. అది మొదలీమె యాహారము గ్రహించుట లేదు. నిద్రించుటలేదు. విశ్రమించుట లేదు. ఎల్లప్పుడును ఇట్లే సంచరించుచున్నది. ఈమెంతోడ నడచి నడచి నాకాళులెల్ల నొచ్చుచున్నవి. మిట్ట యనక పల్లమనక రాయియనక రప్పయనక యీమె ననుస రించి నడుచుట దుర్భరముగ నున్నది అయినను నన్నా యాశా పిశాచిక వెన్నాఁడ బ్రేరేపించుచున్నది. ఇఁక నీమెం దారికి ద్రిప్పి కొనుట యెట్లు ? ఒక తెన్నునకు వచ్చెఁగదా నా యుద్య మమున కుపక్రమింప వీలగును? ఏమి చేసిన నీమె కీవ్యసనము మానఁగలదు? ఎంత యాలోచించినను నాబుద్ధికి ఏయుపాయ మును పొడఁగట్టకున్నది.

అయినను సతీతిలకమగు నీమెను ఒక తుచ్ఛునకుఅర్పింప నెంచుట దోషావహమని తలఁతును. నా యకార్య కరణమున ఈశ్వరుఁ డప్పుడప్పుడును తగుశిక్షవిధించుచున్నను మరల మరల ఇట్టి దురుద్యమమునకుఁ బూనుట యసమంజసము. పవిత్రమగు నావును గటికవాని కమ్మఁజూచువారి పగిది నేనిట్టి అకార్య మున కుపక్రమింపనగునా? అపకారియగు వానికిం బ్రతీకార గవేషణ మావశ్యకమగుచుండ దాని మాని ఇట్టి యకృత్య మొనర్చిన లాభమేమి? ఆపాపికొఱకు నేనెన్నితడవలో దుష్ప్ర వర్తన మొనర్చియుంటిని. అపవాదముల పాలైతిని. ఇహపర

విదూరుఁడ నైతిని. ఈవిషయ మొక్కింతయేనిం దలఁపక, యక్కటిక మింతేని లేక, నాకంత యుపకారము గావించిన వానికొఱకా నే నీనీచకార్యము సేయఁదలపెట్టుట!

ఇట్లని యూరకున్నమాత్రము రాఁగల లాభమెద్ది? గౌరవములేని యిట్టియగస్త్యభ్రాతలు పెక్కురుండుట కన్నను యుక్తిశాలియై వానిఁగాంచిన వాఁడొక్కఁడున్నను సరియగు. రాజాశ్రయ మున్ననేకాని అట్టిది సఫలము కాదు"

అని యాలోచించుచు ముందుఁబోవు నా స్త్రీని వెంట నంటిపోవుచుండెను. ఈమెముఖము చూచినంతనే తృణచ్ఛన్న కూపమనుట వ్యక్తపఱలాగున నుండెను. సరళహృదయ యయ్యె వ్యసన మధ్యగత యగుటచే ముందుబోవు నాయువిద యుని గుర్తింప లేకపోయెను. ఆమె నిక్కముగ నీమె యుప కారిణియేయని తలఁచెను.

మొదటి స్త్రీ:—తరళికా! మార్గ మధ్యమున నన్నాదరించి నీ యకారణ వాత్సల్యమును వెల్లడి పఱచితివి. ఆ ఋణమును నేనెట్లు తీర్చి కొనఁగలను? నాకిపుడంత కుఁడు సమీపించి యున్నాఁడు, నే నిఁక మనఁజాలను. నా యనంతరమున కన్యాకుబ్జమున కరిగి రాజ్యశ్రీ మృతినందెనుగాన యుక్తమగు వారి రాజు గావించి కొనవలసినదని నాయాజ్ఞయని నా మంత్రులతోఁ జెప్ప వలయును. ఇంత మాత్ర ముపకృతి గావించిన నదియే పదివేలు.

తరళిక:—అన్నియు నెఱిఁగిన నీవిటు పామరులవలె వ్యసన పడుట పాడిగాదు. పుట్టినవారి కెప్పట్టున నైనను మర

ణము సంసిద్ధము. ఇది తెలిసియు నీవిట్లు చింతించుట కదు పొరబాటు. ఎంత వగచినను మరణించినవారు తిరిగి రాఁజాలరు.

రాజ్యశ్రీ:—భార్యకు భర్తతోడిదలోకంబు. విధవయగు నా జన్మ మెందునకు? నే నెవరి కొఱకు మనవలయును? "మృతే మ్రియేత యానారీ సాస్త్రీజ్ఞేయా పతివ్రతా" యను నార్యోక్తి చొప్పున నా పాతి వ్రత్యమును వెల్లడి సేయుదానను.

తరళిక:—అను మరణ మశ్లాఘ్యమని నేఁజెప్పసాహసింప లేను. భర్తవెంట నొక్కచితిపై నారోహించినచో అయ్యది యే సహగమనమగును. ఎచ్చట నెప్పుడో మృతి నొందిన భర్తకుగాను ఇచ్చట నిప్పుడు మరణించుట యుక్తముకాదు.

రాజ్యశ్రీ:—భర్త సమీపమునఁ గాకున్నను తత్పాదముల ధ్యానమును సేయుచు ఎచ్చట మరణించినను నను మరణమే యగును.

ఇది వినిన తరళికయు బదులేమియు నాడఁజాలక మౌన మవలంబించెను. రాజ్యశ్రీయును అంతకంతకు అతిశయించుచు పైపైఁ బొరలివచ్చు వ్యసనము నాఁపికొనఁజాలక ఇట్లని విల పింపసాగెను.

"ఆహా! నాథా! అరి భయంకరుఁడవగు నీ విట్లు అకాల మరణమునందుట కాలపరిణామమే కాని అన్యముకాదు. నీ మాటల కెన్నఁడును ఎదురాడని నన్ను విడనాడి ఇట్లొంటరిగా నేఁగుట భావ్యమగునా! నీ పాద పరిచర్యంగాని ఒండెద్దియును

ఎఱుఁగని నా యెడ నేయపరాధముం జూచి నను వీడితివి. బ్రదికిన దినములలో ఇచ్చకము లాడుచుండి మరణించినది తెలిసి, ఇంకను ఈకఠినాత్ముఁరాలు జీవించియుండుట యేటి న్యాయమని తలఁపకుము. ఇదె వచ్చుచున్నదాన. నేరాకున్న నన్యకాంతా విముఖుఁడవగు నీ కచ్చట సుఖమెట్లు కల్గును? మీరట కష్టపడుచుండనే నూరకుండు దాననే! చెలి! నాకిటఁ జితిఁ జేర్చుము. అం దగ్ని నిడుము. దానిం దరికొల్పుము.

ఔరా! మహారాజ కులోత్పన్ననై, సకల జన సంస్తూయమానుఁడగు వారికిం బత్నినైన నా యాజ్ఞ ఇప్పుడు క్రియాశూన్యమయ్యెనుగా! గౌరవ శూన్యులగు వారి మాటల నెవ్వరు పాలింతురు? గతభర్తృకనై, గౌరవ హీననై మనుటకన్నను చచ్చుటమేలు. మరణింప నున్న నామాటల నెరులు వినకుండిన దాన నాకేటి లోటును గలుగఁబోదు. ఇదె పడియుండు నీ పుల్లల నేరి చితిం బేర్చి అందగ్ని నిడి ప్రజ్వరిల్లఁ జేసెదను గాక అర్ధాంగి నగుట తన్మూలమున నెల్లరకును విశదము కాఁగలదు."

తరళిక:—స్వామినీ! నానుడులిట్టుఁ బెడచెవిం బెట్టుట తగనిపని. ఆత్మ హత్యకంటె నధికమగు దోషము వేఱులేదు. జీవ కారుణ్యము ముఖ్యమని వచియించు శాస్త్రము లెల్లను అన్యహింసయే తగదనుచుండ ఆత్మహత్య యెట్లుచితమగును?

రాజ్యశ్రీ!—ఇయ్యది యాత్మ హత్యయని పల్కుట సాహసము. శాస్త్ర సమ్మతియు గాని దాని రాజ్యశ్రీ యెన్నడు ఆచరింపఁ గడంగదని యెఱుఁగుము.

తరళిక:—అమ్మా! నిన్నెట్టులైనను ఈ యుద్యమమునుండి మర ల్పవలసినట్టుల స్నేహపాశము నను నిర్బధించుచున్నది.

రాజ్యశ్రీ:—అది నీ కసాధ్యము. న్యాయ పరతంత్రనగు నేను నీ వాక్యములకు లోఁబడఁజాలను. స్నేహము నిన్నిట్లు పురి గొల్పుచున్నదనుట నేను నెఱుఁగుదును. దాన రాజ్యశ్రీయను వనిత యొక్క ర్తుక యీ లోక ములో నుండెనను వార్తయె మఱచి పొమ్ము. అగ్ని ధారా పూర్వకముగఁ బరలోకమున కేఁగిన నా భర్త కు ఆత్మ సమర్పణము గావించికొంటిని. అతని వస్తు వాతఁడు గ్రహింపఁ నెంచిన నే నడ్డువడఁజాలుదునే! దాన దత్తాపహార దోషమును సంక్రమించును.

అని యామె అచ్చటి కాష్ఠములం జేర్చి చితి నొక దాని నిర్మించి తన యొద్దనుండు చెకుముకి రాతిచే నగ్నిం బుట్టిం చెను. అంతఁ దానా యగ్నిం బడఁ బోవుచు భర్తయొక్క యా కృతిని మానసములోన ధ్యానించి నిజప్రయత్నమున నుండెను. ఆ తరుణముననే హర్షవర్ధనుఁడును, విభాకర మిత్రుఁడును, మంగళికయు నటకువచ్చిరి.

"అమ్మా! హూణ హరిణ కేసరి యని ప్రసిద్ధి గాంచిన ప్రభాకర వర్ధనుని గర్భమున జనించి యిట్లగతికవై కానన మునఁ బడి మరణించిన నింక నుపయోగ శూన్యుఁడనగు నా బల మెందులకు? మిత్రపత్ని కంటికెదుర మృతి చెందుచుండ నామెను రక్షింపనేరని యీ జన్మమేల? వేయిమంది పరి చారికలు చుట్టి ముట్టి యుండ నుత్సాహముతో వచ్చుచుండు నీ విట్లొంటరిగ నడచివచ్చి ఈ యడవిలోఁ బడి చావనుండ

చూచుచుండు నానేత్రము లుండి ఫలమేమి? నిన్నిటుల [illegible]
ములపాలు చేసిన నా కీహర్షవర్ధన నామము [illegible]ర్థక[illegible]నే? ప్రయోజన శూన్యుఁడనగు నా కీవిభాకర నామము మాత్రము చాలదా! మిత్రుని గాని మిత్రపత్నినిగాని కాపాడఁజాలని నా కీమిత్ర నామము జంటించి కొనుట వ్యర్థమేకదా! ఇట్టి యమంగళము జరుగుచుండ నిషేధింపఁజాలని నా కీమంగళిక యను నామము నిరర్థకమే కదా! సోదరీ! ఇది న్యాయము కాదు. బిడ్డా! నీకిది పాడిగాదు. అమ్మా! ఈ సాహసము నీతి విదూరము. నిలు నిలు మిది చాలును. అఁగు మాఁగు మిఁక నిట్లు సేయఁదగదు. తాళు తాళు మిఁక నిట్టి కార్యముల మానుము."

అని యిటు వీరాక్రోశించుట విని యదరిపడి రాజ్యశ్రీదేవి వెనువైపునఁ జూచెను. హర్షవర్ధనాదు లచటికి వచ్చుటకు విస్మితయై చిత్రార్పిత ప్రతిమవలె కొంత వఱకుండి;

"హా! సోదరా! ఎదురవచ్చు నీపై నెంతయో యాదరము చూపు మీబావ పరలోక సుఖాపేక్షి యయ్యెఁగా! అయ్యో! ఒక్కెడ సోదరీ వైధవ్య వ్యథయును ఇంకొక వైపున సోదరి మరణ దుఃఖమును ఇట్లిరువంకల వ్యసనము గలుగుటచే నీ శరీరము శుష్కించి శల్యావశిష్టమయ్యెనుగా! నీయీయాకారముం జూచియుఁ బవులని నాగుండియ శిలయో యయఃపిండమో వజ్రమో యైయుండ నోపును. ఆహా! భిక్షుకవర్యా! మీమాట చెవి సోఁకినంతనే అతివినమ్రుఁడై మిమ్మెదుర్కొని కొనివచ్చు మీ మిత్రము లోకాంతరమున కరిగెఁగా! సర్వసంగ పరిత్యాగులరయ్యు మిత్రప్రీతిని మాత్రము విడఁజాలకుండిన మీకిప్పుడు దుర్భర వ్యసన ముదయించెనుగా!

ఇంక మీ సేవగను నీవాము వీడుట దుస్సాధ్యము. ఇంతకును నాఁటి మీమాట పాటింపమి నిట్టి పాటు గల్గెను. చెలీ! పరి చారికలం బరమప్రీతలం గావించు నా పరమ కారుణికుఁడు పరలోకమున కరిగెఁగా! ఇంక మీ దీనఃఖము నెట్లు నిస్త రింపఁగలరు? ఇంతకును ఎవ్వరు మాత్రమేమి సేయఁగలరు? మీ రెల్లరును నాకాజ్ఞ యొసఁగుఁడు. పరలోక వాసియగు నా పతికి పరిచర్యలు సేయ నరుగుదును."

హర్ష:—చింతార్ణవగతుఁడనగు నన్ను నింకను నలియఁ గొట్ట కుము.

రాజ్యశ్రీ:—అట్లని నా సహధర్మ చారిణీత్వమును వీడుట న్యాయమగునా?

మంగళిక:—దుఃఖాకులవగుటచే నీ మదికిది పొడఁగట్టుకున్నది. శ్రాద్ధాదుల మూలమున భర్తను సంతుష్టం గావించి వ్రతోపవాస కర్శితవై మని యుంట చచ్చుట కన్నను శత గుణం బధికమగును.

రాజ్యశ్రీ:—నీ వెంత చెప్పినను నాకు దీనికంటె వేఱు ధర్మ ముందు లాగునఁ దోఁచుట లేదు.

విభాకర:—అమ్మాయీ! పెద్దవాఁడను. నీభర్త యొక్క మి త్రుఁడను. సన్న్యాసిని. నా మాట త్రోసి పుచ్చక యాచరింపవలసినది నీకు విధియగును. నీవిపు డాచ రింప నెంచినది యాత్మహత్యయే యగును. నీ చెలి యాడిన లాగున మనియుండుటయే యుక్తము. ఇందఱి నొక్క పెట్టున దుఃఖసముద్రమున ముంపఁ జూచుట పాడికాదు. నీ భర్తకును నాకును ఆకృతులు భేద

ములుగాని హృదయ మొక్కటియె. కావున నేనాడు నది నీభర్తకును అభిమతమగునదనియే యెంచుము. నా యాజ్ఞ మీఱిన నాయానగలదు.

ఇది విని రాజ్యశ్రీయును బదులాడ లేక ఇంచుక యాలోచించి తుదకు మది నొక్క తీరునఁగుదుటఁ బఱచికొని తన కోంటి ప్రయత్నమునుండి మరలెను. ఇంతవఱకును రాజ్యశ్రీ ననుసరించి వచ్చుచుండిన యా యాఁడుదియు హర్ష వర్ధనాదులు సంభాషించుచుండఁదానిటులఁ జింతింపఁజొచ్చెను.

"ఏమి యీ చిత్రము! ఈ మంగళిక యెట్లు చెఱఁ దప్పెను? శశాంక గుప్తుం జంపి హర్షవర్ధనుఁ డీమెం జెఱ నుండి విడుదల గావించియుండునా? లేక యేదే నొక తంత్ర మునఁ దప్పించికొనివచ్చియుండునా? అబలయగు నీమె యంతటి సాహసమునకుఁ దివురునని తలఁపను. ఏది యెట్లున్నను నా చిరకాల కాంక్షితము వమ్మయ్యెను. ఇంక వీరు నను జూడక మున్నే ఇటనుండి పలాయనము గావించుట యుచితము."

అని యెంచి మెల్లె మెల్లగ నా ప్రదేశమునుండి వెడల నుపక్రమించెను ఎచ్చట వా రనుమానింతురోయని వెనుపై పునఁ దిరుగక వారి కభిముఖయై యుండినట్లు వెనుక వెనుక నడుగు లిడుచుఁ బోవుచుండెను. మంగళిక మాత్రము తానిచ్చటికి వచ్చినది మొదలుగ ఈ వ్యక్తిపై దృష్టియునిచి యుండినది కావున దీని పలాయనపరాయణతను గనిపెట్టి హర్షవర్ధను నవలోకించి యిట్లనెను.

మంగళిక:—ఆర్యా! మహాత్ముల సెలవు గైకొనక చల్లఁగ జాఱఁ జూచుచుండు నా వ్యక్తింబట్టి బంధింపుఁడు.

అంత మీరెఱుఁగని కొన్ని యంశములు మీకు వ్యక్తము కాఁగలదు.

ఇది వినిన రాజ్యశ్రీ మంగళిక యిటు లాడుటకు కారణమేమని యాలోచించుచుండ నా వ్యక్తియు నీ మాటలు వినినంతనే యించుక వేగముగా నడుగు లిడఁజొచ్చెను. ఇది గనినంత హర్షవర్ధనుఁడును విభార మిత్రుఁడును ఆవ్యక్తిపై నించుక సంశయించిరి.

రాజ్యశ్రీ:—చెలీ! వీరన్యులని భావింపకుము? మన వారియెడ మనకు సంశయమేల? నను మరణమువలన నివర్తింపఁ జేయ నెంచిన నీ కోర్కిని వీరు పూర్తి గావించిరికదా! అట్టి వారి యెడ నీకీభీతియేల?

రాజ్యశ్రీ పలికిన యీ మాటలఁ బెడ చెవినిఁబెట్టి ముందుకంటె నింక కొంత వడిగా నడుగు లిడఁజొచ్చెను. మంగళిక మాత్ర మప్పటప్పటి కావ్యక్తియొక్క యడుగుల వేగమధికమగుట గుర్తించుచుండెను.

మంగళిక:—దేవా! ఆలసింపకుఁడు. దూరగతమైన మీకుం బట్ట నలవిగాకుండును. నాకుం జూడనిది పుంవ్యక్తి యనియే తోఁచుచున్నది. దేవిగారి విరోధివర్గములోని వాఁడని తలఁచుచున్నాను.

రాజ్యశ్రీ:—చెలీ! నాకీమె దారి నెంతో సాయమొనరించెను. అట్టిదాని యెడ నీ విట్లు పొరబాటగు నభిప్రాయమును బొందుట న్యాయముకాదు.

మంగళిక:—అమ్మా! మిమ్ము వంచించి శశాంక గుప్తునొద్దఁ జేర్చుటకుఁ దోడ్పడునుగాని మీ క్షేమమునకు సాయ

పడునది కాదు. గోముఖవ్యాఘ్రమై స్త్రీ వేష సంఛ
న్నుఁడగు పురుషాపశదు నెట్లు నమ్మెదరు? వీఁడా శశాంక
గుప్తుని చెఱనుండి తప్పించికొని వచ్చిన జయచంద్రుఁ
డేయగును.

ఈ మాటలు వినినంతనె యా వ్యక్తియు వెను దిరిగి పర్వులిడ నారంభించెను. అంత నేనుఁగుపై కురుకు సింగము వలె హర్షవర్ధనుఁ డావ్యక్తి పయింబడి పట్టికొనియెను. ఈ సందర్భమున శిరమున నతికించికొని యుండిన యావ్యక్తియొక్క మాయ వెండ్రుకలు రాలిపడెను. ఇదిగనిన రాజ్యశ్రీకి నాశ్చర్యము నొండాయెను. ఈ విషయము గనిపెట్టిన మంగళిక బుద్ధి కుశలత కెంతయు మెచ్చికొనెను. హర్షవర్ధనుఁడు నెంతయు నలుకబూని యాతనిం బంధించి, జుట్టుపట్టి వీరియొద్ద కీడ్చికొనివచ్చెను.

మంగళిక:—ఓరీ! జయచంద్ర పాతకా! దేవిగారి శశాంక గుప్తునొద్దఁ జేర్పనెంచిన నాఁటి రాత్రి నా దెబ్బజ్ఞప్తి యున్నదా! గోపవేషమున నాపల్లెనుండ నీవరు దెంచి ననాఁడే నిన్నా యూరి వారికింబట్టి యీ నెంచితినిగాని దయతలఁచి విడిచి పుచ్చితిని. నీచున కెంతమాత్ర ముపకృతి యొనర్చినను దానికిం బ్రతిగ మన కాతఁ డపకృతియే కావించును. కాఁబట్టియే కదా మా దేవి గారి కపకారము గావింపసమకట్టి యిట్టి వేసమూని వచ్చితివి! నీ వాపల్లెను వీడినది మొదలు నేనును నిన్నన్వేషింపఁదలఁచి యా యూరు వదలితిని. అచ్చటచ్చట నిను వెదకుచు నీ ప్రాంతమున నీ వీమె ననుసరిం

చుట గనిపెట్టి మీా కెఱుక రాకుండ మీా వెంటనే వచ్చుచుంటిని. నీ వాచరింపనున్న దార్ణయముల నప్పుడే యూహించి తెలిసికొంటిని. హర్షవర్ధన మహా రాజిచ్చట నుండుట నాకు మున్నే తెలియును గావున ఈమె యిట్లగ్నింబడ నుద్యోగించుట దెలిసి వీరిం దోడి కొని వచ్చితిని. నే వీరితోడ సంభాషించుచు నుండినను నీపైఁగల దృష్టిని మాత్రము వీడకుంటిని. ఈ లాగున నుండ నీవు దప్పి నొంచిన నెట్లు సాధ్యమగును?

రాజ్యశ్రీ:—నాఁడా పాఱువడిన యుంట నిను సాధించి నంతనే పురుష వేషము ధరింపమని యాగ్రాల కుందగు నుడుపుల నా కొసఁగి, నాకుఁ దోడ్పాటుకై పురుష వేష ధారిణులగు నేవురుఁ బరిచారికల నేర్పఱచియు న్నట్టు వచించి వెడలిన నీవు గోపాలక వేషము ధరింప నేమి కారణము?

మంగళిక:—ఆలాగున నీచే ననుజ్ఞాతనై వెడలిన దాన నీ నీచుని వెన్నాడి నాచేతి కత్తితో నొక దెబ్బవైచితిని. ఇంత లోన నీతని సహచరుఁడు చంద్రకేతువను వాఁడు వెను వైపుననుండి యరుగుదెంచి నను బంధించెను.

రాజ్యశ్రీ:—నీచుఁడు వాఁడు చోరునివలె వెనుకనుండి వచ్చి బంధింపకున్న వీరవనితవగు నీవు వారికిఁ జిక్కకుందువు. సరి. తర్వాతియు దంతము నెఱిఁగింపుము.

మంగళిక:—అంత వీరిరువురును నా తోడఁ గన్యాకుబ్జనగ రము వెలుపలి కరుగుదెంచిరి. అచ్చటఁ గొందఱు భటులును నొక పల్లకియు నింతకు మున్నే వీరు సిద్ధ

పఱచియుంట నన్నుం దారోహింపమనిరి. ఒక్కదానను పెక్కురతో విరోధించుట పాడికాదనియు సమయము చూచి తప్పుట సరియగునని తలంచి అందెక్కితిని. వీరును నను దేవిగారనియే యెంచి యుండిరి. ఈరహస్యము శశాంక గుప్తునితో సంభాషించువఱకును బయలు పెట్టనైతిని. అప్పుడును నా పరిచారికాత్వము దెలిసినం దన కనురూపం గానని నను విడిచి పుచ్చునని యే యట్లు పలికితిని. అప్పటికిని ఆ నీచుండు నన్ను గామింతుననవానిం దిరస్కరించితిని. వాండాగ్రహించి నన్ను కారాగారమున బాధించెను.

రాజ్యశ్రీ:—ఆహా! నాకొఱ కెన్ని కష్టముల పాలైతివి! నిక్కముగ సఖివన్న నీవయగుదువు. ఆవలి వార్తం దెల్పుము.

మంగళిక:—దైవము నా కనుకూలించుటచే నాకుం దెలియని యొక్కరుండు పొరబాటున నన్నుం దన వానిగా భావించి యొక్కనాంటి నిశీథమున నటనుండి తప్పించెను.

ఇది వినిన జయచంద్రుండు తనమది నిట్లని తలంచెను. "ఆహా! ఈమెకుం దెలియని యానూత్నుం డెవ్వండు? అతండే నా భావయగును. నను విడిపింప నరుదెంచినవాండు పొరబాటున నీ బిడను తప్పించియుండ నోపును. నా కాహారము నందిచ్చు వాండు "నా భావనను విడిపింపం బ్రయత్నించుచున్న వాం"డని నుడివియుండెను.

రాజ్యశ్రీ:—మంగళికా! ఆవలి వృత్తాంతముం దెల్పుము.

మంగళిక:—నేను నటనుండియే కళింగ దేశమున నొక యగ్ర

హారమున కరిగి అందా యగ్రహారపు టధికారియింట పసులకాపరినై యుంటిని. ఆవలి వృత్తాంత మీతకు మున్నే వచించితినికదా!

రాజ్యశ్రీ:—చెలీ! అలనాఁడు నన్నితని బారినుండి కాపాడి నదిగాక నేఁడును ఇతనిపాలఁబడకుండ ననురక్షించితివి. నీ ఋణమును నే నెట్లు తీర్చుకొందును!—జయచంద్రా! నీవా యగ్రహారమున కెట్లు వచ్చితివి!

జయచంద్రుఁడు:—ప్రాణములమీఁదికి వచ్చినప్పు డింక దాఁప నేల? మంగళిక మూలముననేఁ దోడి తెచ్చినది దేవికాదని తెలిసి ఆ యగ్రహమున రాజు నన్నంధకార దుర్గమునఁ జెఱనిడెను. నేనట దైవానుకూల్యమునఁ జిక్కిన యొక యినుప ములికిని ఆధారము గావించికొని ఆ చెఱసాల వెనువైపునఁ ద్రవ్వుచుంటిని. ఇటులఁ గొంత కాలము సేయునప్పటి కొక్కఁడు దూరఁదగునంతకంత యేర్పడినది. దేవునిపై భారము వైచి సాహసించి ఆ కంతనుండి క్రిందికిదూఁకి చెఱఁదప్పితినిగదాయని సంతస మందితిని. ఆ ప్రదేశము దట్టమగు చెట్లచేఁ గ్రిక్కిఱిసి యుండునది కావున నాయరణ్యమార్గమున బయలుదేఱి తిన్నఁగా వెళ్లుచును ఆపల్లియలో ఈమెను సంధించితిని. పురుష వేషమున నుండుటచే ఈబిడను గుర్తింపనైతినిగాని గొంతుసవ్వడిమాత్రము ఎచ్చట నోవినినలాగుననున్నదని ఇంచుక సంశయించితిని. మరల నన్నెవ్వరుకనిపెట్టెదగో యని భీతిజెంది, ఈమె కెఱుక రాకయే వెడలితిని. అచ్చటచ్చటఁ దిరుగుచుండ మిముఁగని వంచనచేసపహా

రించి మా రాజున కర్పించి ఆతనిమన్ననలం బడయనెంచి ఈ యాఁడు వేసము బూని సమయము నిరీక్షించుచు ని మ్మనుసరించివచ్చు చుంటిని.

విభాకర:—అమ్మాయీ! బాధవిముక్తిం గాంచిన నీవు ఇచ్చటికి ఎట్లు రాఁగలిగితివి?

రాజ్యశ్రీ:—పరిచారికల సహాయము గలిగి కొంత కాలము కన్యాకుబ్జమున నుంటిని. వారి మూలముననే అటఁ గుట్రలు సేయుచుండు దుష్టచతుష్టయముల జాడఁ గనుఁగొంటిని. అంత వారింబట్టి అమాత్యు నధీనము గావించితిని. పూలమ్మినచోటఁ గట్టెలమ్ముటకు ఎవ్వరిష్టపడఁగలరు? మంచి సమయమున సంతసము నిచ్చుచుండిన యా నగర మప్పుడంత వెగటుగఁ దోఁచెను. ఆవల నాయూరినుండి వెడలి అచ్చటచ్చటఁదిరుగుచును ఈ మాయావిశోకుఁడు వడసితిని. పతింబాసి మన నొల్లక చావనుండు తఱిమీచే రక్షింపఁబడితిని.

అవల విభాకర మిత్రుఁడు చెంతనుండు తన యాశ్రమమునకు రావలయునని కోరుటచే నాతని యానతి చొప్పున నెల్లరు నచ్చటి

## పదునేనవ ప్రకరణము.

### ఆత్మమిత్రుఁడు.

నభోమండల విద్యోతమానమగు ఖద్యోతబింబము ఆ తపమున లోకముల నెల్లఁ దవులఁ బెట్టునటులఁ దోఁచుచుండెను. ఎల్లరును నీడను జేర నత్యంతము ప్రియపడు చుండిరి. ఆకులెల్ల మాడి నేలరాలనవనీరుహము లవకేశులయ్యెను. పక్షులుగూడఁ దమగూండ్లను వీడి నెలకిరా జాకుచుండెను. జలాధారములు శుష్కీభూతము లగుచుండెను. చెట్టును జెట్టు నొరయుటచేఁ గలిగిన యగ్ని చొంతనుండు వెదుళ్లపొదలం దవిలి మండు చుండ 'ఫెళ్లు, ఫెళ్లు'మని ధ్వని వినసాగెను. ఒక్కింతయైన గాలిలేకుండుటచే నాకు నాడకుండెను. అట్టియదనున నహిపుర ప్రాంతకాంతారమున నొక స్కంధావార మమరియుండెను. పట కుటీరములు పెక్కట నుండెను. స్కంధావారములోని యధికారి వర్గమంతయును బయలునకు రాకుండెను. సూర్యరశ్మి యించుకైనఁ జొరనేరని యొక్క పొదయందుఁ గొందఱు సైనికులుండిరి. వా రొండొరులతో నీలాగున సంభాషించుచుండిరి.

"వారు మనల విశ్వసించుట నాకాశ్చర్యము పెంచుచున్నది:"

"మన నటన లందుమనకుఁ గారణము. కావున నా విషయమున జాగరూకులమై మెలఁగవలయును."

"సరి. ఇఁక నాతని వధించుటెట్లు?"

"మెల్లగ మాటలాడుము. ఎవ్వరేని వినిన నపాయము వాటిల నోపు."

"అట్లేల సంశయించెదరు? ఈ యుగ్రా తపమున నేరును రాఁ జాలరు. కావున నోయతుమిత్ర సేనాపతీ! వాని సంహార మున కుపాయము సెలవిమ్ము."

"మీరీ రేయి నానీచుఁడు భండియుండు పట కుటీరము వెను నైపునఁ బల్లము త్రవ్వి లోనంజొచ్చి నిద్రితుఁడగు వానిం గడ తేర్పుఁడు."

"నిద్రించుచున్నవానిం జంపుట యయుక్తముకదా!"

"ఓయీ! అశ్వత్థామ యంతటివానికే దోషము గలుగనప్పు డాచింత మనకేల? సేనాపతి యానతిచ్చిన లాగునఁ జేయు దము."

"మిత్రుని వాక్యము శ్లాఘాపాత్రము. దాన నామాటల విశ్వాస ముంపుఁడు."

"మేము నల్వురమును అట్లే కావింతుము."

వీరిటు మాటలాడుచుండ వీరికించుక సమీపముననుండు నొక పొదయం దిర్వురు యువకులా సీనులై యుండి వీరిమాట లాలించి ఈ లాగున సంభాషించికొనిరి.

"మిత్రమా! వింటవే వీరిమాటల్లు! అదేలకో నాకుమాత్ర మీ యతుమిత్రునిపై ఆదినుండియు సంశయ ముదయించి యున్నది. వీని యీ వంచనలఁ దెలియని సరళ హృదయుఁడగు భండి వీరినెంతయు విశ్వసించియున్నాఁడు. నామము నిర్దిష్టమ గుటచే వీఁడొక్కఁడు మాత్రె మెఱుకవడెను. తక్కినవా రెవ్వ రై యుండ నోపుదురు? ఇప్పుడీ యాపదనుండి భండిం గాపాడు నుపాయ మాలోచింప వలయును."

"నేనొక్కఁడ వారింగడ ముట్టింపఁగలను. మీసాంగత్య మహిమను నాకంతటి శక్తియలవడి యున్నది."

"ఏ యుపాయముచే నీకార్యము పూర్తి గావింతువు!"

"కార్యము కొనసాగునంత దనుక మాత్రము గుప్తముగానుండ వలయునుగదా! వారిమాటల మన మాలకించినలాగున మన మాట ఘెయిరులు నాలింప నోపును."

"కానడి యేవంక నుండిన నేమి? ఇలుఁ జేయుటయ కదా ప్రధానము!"

అని యిటు వీరు మాటలాడి కొనుచుఁ గొంతసేపచ్చట విశ్రమించి సాయం సమయమున వారివారి గుడారముల కేఁగిరి.



## పదియాఱవ ప్రకరణము.

## చంద్రశేఖరుని విచారణ

"మిత్రమా! నాప్రాణములఁ గాపాడ నరుగుదెంచితి వని తెలియక నీ విషయమునఁ గ్రూరత్వమును బూనితిని గదా యని చింతిలుచున్నాను."

"అపరాధి యని యెంచికదా మీ రట్లాచరించితిరి!"

"ముందు వెనుకలాగయక నిను బంధించినది దోషము నియే భావించువాఁడను."

"అట్టి యదనున నాలోచించుచుండుట తగని పని. మీ రప్పట్టున నాచరించినది యుక్త తరమ యగును. ఎదుటి వా రపరాధులేయైనను దేవరవారికి వారింబట్టి యర్పింపక నేను స్వతంత్రించి యకార్యము గావించినది ఈశ్వర సమ్మత ము గానేరదు. కాఁబట్టియే దైవము నా కా శిక్షగావించెను."

"నీమిత్రుఁడు నాచెవిని 'వీఁడును వీని యనుచరులును శశాంగుప్తుని పక్షమువారు. నామిత్రుఁడు మంగళేశ్వరుఁడు వీరివలన నీ కాపద గలుగకుండ రక్షించె'నని యాడువఱకు నీవే ద్రోహివని యెంచి యుంటిని. ఆవల నే పడినయది పొరబా టని యూహింపఁ గలిగితిని. అజ్ఞాన కృతమగు దానికిఁ బశ్చా త్తప్తుఁడ నైతిని. అపరాధ మొక్కఁడను సందియ మొక్క డను గలుగుట లోక సహజము. ఇంతకును నీ వా ప్రదేశ మున లేకుండిన నాకు సంశయ ముదయింపఁ జాలదు. త్రాటి నీడం గూరుచుండి పాలు ద్రావినను మద్యము గ్రోలెననియే జను లెంతురు. ఎవ్వరెట్లెంచినను నిజము నిలుకడమీఁదఁ దెలి

యక పోవునా? ఎప్పటికైనను సత్యము విజయము గాంచ కున్న నీ లోకము సర్వమును శూన్యమ యగుఁగాదె?— అది యటుండనిమ్ము. అడుగ మఱచితిని. నీ యుదంత మెఱుక వఱచి నాకు మహోపకారము గావించిన నీ మిత్రము నేఁటి యుదయమున మన కెఱుక లేకయ వెడలుటకు మాత్రము నే వగచుచున్నాఁడను."

"నాకు నయ్యది వింతగనే యున్నది."

"ఇట నుండిన నేదే నపాయము గల్గునని సంశయించి ఎచ్చటికే నరిగియుండ నోవును."

"మీచే రక్షితులమగుమా కపాయము గలుగునను శంక జనింప నవసరములేదు. ఏదే నను ల్లంఘనీయమగు ఘన కార్యము తటస్థించి యుండునుగాని వేఱుకాదు. చంద్రకేతుని పక్షమువార లెవ్వరే నీతని కపాయము గల్గింతురను భీతి నాతఁ డరిగి యుండునని తలఁచు చుంటిరి కాఁబోలు! వాని పక్షము వా రానల్వురును జచ్చిరి. ఇంక నేరును లేరు. కావున నట్టివలవని సంశము పడనక్కఱ లేదు.

"నాఁటి రేయినుండియు నే నేరిని నమ్మకుంటిని. వారిని వీరి నననేల? ఒక్కొకపుడు నన్నే నేను నమ్మఁజాలకున్నాఁడను."

"మీరిఁక నిట్టి భ్రాంతిని వీడుఁడు. పేరు మార్చికొని మాఱు వేసము పూనియుండినందున వానిం దెలియఁజాలకుంటిని గాని లేకున్న వాడప్పుడే యమసదనమున కరిగియుండఁడా?"

"వాఁడపుడు తామ జెఱనుండి విడిపింపఁ బడితినని గదా వచియించెను! అట్లు కారాగారమున బంధింపఁ బడు

టకుఁ గాని విడిపింపఁ బూఁటకుఁ గాని కారణ మేమి యుండ నోపును ?"

"విచారణ సమయమున నది బయల్పడునని యెంచె దను."

"అప్పుడు మాత్రము అది బయలు వడకుఁ బ్రసక్తి యేమి కలదు ?"

అందులకుం దగు ప్రసక్తి మనము గల్గించికొనవచ్చును లెండు."

"అట్లే కానిమ్ము. క్రమముగ నారయుదము."

అని యిటు భండియు మంగళేశ్వరుఁడును సంభాషించు చుండ నొక భటుఁడువచ్చి కుమార చక్రవర్తి యరుదెంచుచుం డుటం దెలిపెను. అంతవారు నాతని కెదురేఁగి తోడ్కొని వచ్చిరి. సేనాపతియుఁ గుమారు నర్ఘ్యవిధిం బూజించెను. కుమారు ననుమతిని దాను నుచితాసనమున నుపవిష్టుఁ డాయెను.

కుమార:—సేనాపతీ ! ఈ నూతన పురుషుఁడెవ్వఁడు ?

భండి:—ఈతనిది ఘూర్జర దేశము. మంగళేశ్వరుఁడని యీతని నామము. ఇతఁడును, ఇతని మిత్రుఁడు మఱి యొకఁ డును శత్రువిజయము గావింపనున్న మనకుఁ దోడు వడ నెంచి మనసేనలోనం జేరియున్నవారు.

కుమార:—ఈ కాలమున జిరపరిచితులం గూడ నమ్మ వలను గాకున్నది. అటులుండ నపరిచితుల నెట్లు విశ్వసించు చుంటివి ?

భండి:—వీరిద్దఱి మూలమున నాకుం గల్గనున్న గొప్ప యాపద యొకటి తప్పెను. కాఁబట్టియే వీరిని విశ్వసించితిని.

కుమార:—ఈతని మిత్రుఁడతఁ డెచ్చట ?

భండి:—నిన్నటినుండియు నతఁడు గానవచ్చుట లేదు.

కుమార:—అట్టులా ! అయిన వీరి విశ్వాస పాత్రత ఇంచుక సంశయాస్పదము.

భండి:—అటుగాదు. కారణమేమియు నుండక యాతఁ డాలాగున నంతర్ధానుఁడుగాఁ జాలఁడు.

కుమా:—కారణ మేముండునో కనుఁగొనఁ గల్గితివా !

భండి:—ఇచ్చటఁ జరిగిన యొక కుట్రయే కారణ మగునని నే నూహించెదను.

కుమా:—ఆఁ! కుట్రయా !

ఇది వినిన మంగళేశ్వరుఁడును ఈతని యప్పటి ముఖ భావముల నవలోకించి అచ్చెపడియెను. కారణమేదియో తెలియక విస్మయ పడుచు ;

“ఈతనిఁ జూడ నేదోయొక కుట్రం గనిపెట్టుట కెంతయో పాటువడియుండ నోపునని తోఁచెడిని. లేకున్నఁ గుట్ర యనుమాట చెవిసోఁకఁగనే ఇట్టి మార్పునెందనేల? ఈతఁడు స్థానేశ్వరమున కరిగి యుండె వనికదా చక్రవర్తి వచియించి యుండెను ! అచ్చటనేమైనఁ గుట్రలు జరిగియుండునే! అట్లైనం దానికిఁ గారకు లెవ్వరు ? రాజ్యవర్ధనునిచే నోటువడిన హూణు లేమైనం గుట్రల నాచరించి యుందురా! అది సరిగాదని తోఁచెడిని. ప్రభాకర వర్ధనుని పేరు విన్న నదరుచుండియు, రాజ్యవర్ధనుని మూలమున ననేకవిధముల బాధలుచెంది బ్రదికియుండిన నంతియు

చాలునని యెంచిన యాహూణు లింతటిపని కుపక్రమింపఁ జాలరు. ఇంక మాళవ దేశవాసు లెవ్వరేని ఇట్టి యకార్యమునకుఁ గడంగిరా!—అయ్యది యుక్తమని గోచరింపదు. మాళవదేశ వాసులెల్లరును హర్షునందెంతయును భక్తిం గలిగి యున్నవారని వినియుంటిని. దాన నా శంక యనవసరము. ఈ వంగదేశపు రాజగు శశాంక గుప్తుఁ డీలాటి యక్రమమున కుద్యమించి యుండును. ఇది సరియనియే నాకుఁ దోఁచుచున్నది. ఇంతకును క్రమముగ నదివిదితము కాఁగలదు. ఇంతలోన తొందరపడనేల?” అని యాతఁడు చింతించుచుండెను.

కుమార:—అదియెట్టి కుట్రయో తెలుపఁగలవా?

భండి:—శత్రు పక్ష చరులుకొందఱు నన్ననుసరించి సేనలలో గొప్ప పదవులసంది, నను సంహరింపఁ దఱివేచియుండిరి. ఒక్క నాఁటి రేయిని నేను నిద్దురఁ బోవుచుండ నా గుడారము క్రింద గోతిని త్రవ్వి లోనం దూర నుద్దేశించుచుండ వారి కుట్రలఁ గనుగొనిన నాయీ మిత్రుఁడు వారిం బరిమార్చి నన్నాయాపదనుండి తప్పించెను. కుట్రకుం గారకుఁడగు వాఁడు మాత్రము బుధితుఁడై యున్నాఁడు. ఈతని మిత్రుని పలాయనమునకును అతఁడే కారకుఁడగునేమో యని సంశయించుచున్నాను.

కుమార:—అతని యునికి మనుకులేమైనం దెలియునా?

భండి:—శశాంక గుప్తుని పరివారమునఁ జేరినవాఁడు. చంద్రకేతువని యాతని పేరు—స్వామీ! మీరడిగిన విషయమేమొనదియు వివరింపకుంటిరే!

కుమార:—నే నటు స్థానేశ్వరమున కరుగునప్పటికి శశాంక గుప్తుని పక్షమువారు కొందఱు రహస్యాలోచనము గావింప నున్న వారనుట తెలిసికొంటిని. ఇంతలోన శబరనాయకుఁడును ఆతని యనుచరులును ఈ విషయమున నాకుఁ దోడుపడ నెంచి వచ్చిరి. నేనును వారిం బిలిచికొని శత్రుపక్షము వారు మంతన మాడనున్న చోటికి వెడలితిమి. అది యొక యటవీ మధ్యము. అచ్చటనుండు నొక పాడువడిన యాల యమున వారు రహస్యాలోచన గావించెదరని మాకు మున్నే తెలిసి యుండుటచే నా యాలయము నకుఁ జెంతనుండు నొక పొదం దాఁగియుంటిమి. శశాంక గుప్తుని పక్షమువారగు భీమసింహ మలయ కేతువులను వార లిర్వురును గనకలతికయను నొక వా రాంగనయు నక్కడి కేతెంచిరి. వారలతోడన సేనా పతియును వచ్చెను. వానిఁ గాంచిన యా వేశ్యయు ఆతని కోడలివలె నటించుచు; ఈ పురుషు లిర్వురును కుమారశబరనాయకులనియు, వీరు శశాంకగుప్తున కను కూలురైరనియు, మీ రాజును ఈశబరనాయకుని యధీ నమున నున్నవాఁడు గావున నీరాజ్యమును వంగ దేశపు రాజున కర్పించి, రాజ పక్షమువా రేరేనుండిన వారింబట్టి బంధించి వీరి యధీనము గావించునది యని యు, ఇప్పుడు నీ యధీనముననుండు సైన్యమే ఈ మాత్రము పనికిఁ జాలెడిదనియు, అప్పుడు నీకు నమాత్య పదవి నొసఁగెదరనియు, నీవటుఁ గావింపకున్న నిది

వటిలోనన వారికి జిక్కియుండు నీకుమారుని శిరము ఖండించి వైతురుగావున నాకుఁ భిక్షబిక్ష యొసంగు మనియుఁ బ్రార్థించెను.

భండి:—ఏమి చిత్రము! మీ యెదుటనే మీ వేషములు వైచి కొనుటయా! ప్రేక్షకుల యెదుట వారి చరిత్రము నభిన యించు లాగున నున్నది, ఆవలియుదంతము సెలవిండు.

కుమార:—సేనాపతి మాత్రము వారిమాటలనమ్మి చేయునది లేక వారికి లోఁబడఁ బోవుచుండ నావంచకత్రయముం బట్టి బంధించితిమి. సేనాపతి కిది కుట్రయగుట నెఱిఁ గించితిమి. ఆవల విచారణ గావించితిమి. శశాంక గుప్తుని ప్రేరణచే తా మట్లాచరించినటుల వచించిరి. అంత వారిం జెఱనిడి అచ్చట శాంతిని నెలకొల్పి తిమి. నీకీ యుద్ధమునఁ దోడ్పడ నెంచి నేను వచ్చితిని. శబర నాయకుఁడును నిజసైన్యముతోడ సాహాయ్యము నకై వచ్చుచున్నవాఁడు.

ఈ మాట లాలకించుచుండిన సింగళేశ్వరుఁడును విస్మి తుఁడై ఈలాగునఁ దనమదిందలపోయఁ దొడఁగెను. "ఇది యేమి విపరీతము! స్థానేశ్వరపు సేనాపతి యంత తెలివిలేని వాఁడే! ఎవ్వఁడీ మలయ కేతువు? భామిని భర్తయా! అతఁ డిట్టి యకార్యమున కేలపూనును నామసామ్యముంబట్టి నే నిట్టిశంకం జేయుట సరికాదు. మలయకేతు వేడ? శశాంకగుప్తుఁ డేడ? వీరికి మైత్రికుదురుటేడ?" అని యెంచి తనమనసు కుదుట పఱచి కొనెను.

కుమార:—భండీ! ఇఁక నీవా బంధితునిం బిలువ నంపుము. వానింగూడ విచారింతము.

భండి:—అటులే కావించెదను.

అంత భటు నొక్కనిం జీరి చంద్ర కేతువుం బిలచికొని రమ్మనెను. ఆతని యానతి చొప్పునఁ దత్క్షణమే వాఁడు చంద్ర కేతువుం దోడి తెచ్చెను. ఇన్ని దినములుగ నిర్బంధముననుండి యును ఇంచు కేని లజ్జావ్యసనములఁ బొందక యథా పూర్వ ముగఁ గాన నగుచుండెను.

భండి:—ఓ యీ! నీవా స్తవ నామ మెద్ది?

చంద్ర:—ఒక్కనికి రెండు పేళ్లుండుట మీ రాజ్యమున నల వడియుండ నోపును.

మంగళేశ్వరుఁడు:—అగును. బంధితులు రాజున కెఱుక వడక చెఱనుండి తప్పి వచ్చుటయు మా రాజ్యములోని యల వాటేయగును.

ఈ మాటలు వినినంతన వాని మానస మదుర నారం భించెను. అంగములు వడంకఁ జొచ్చెను. కన్నులు దిద్దిరం దిరుగసాగెను. ఇంతకు మున్నుండిన ధైర్యమంతయుఁ బటా పంచమయ్యెను. మంగళేశ్వరుఁడు మాత్రము ఆతని యవ్వ టప్పటి మార్పులఁ గనిపెట్టుచుండెను.

కుమార:-సత్యమాడుము. లేకున్న దండన మింకయును వధికము కాఁగలదు, మూఁగవాసివలె నూరకుండిన నీ సేనా పతి నిన్నూరక విడువఁడు.

మంగళేశ్వరుఁడు:—ఈతఁడు సామ వాక్యములకు లోఁబడు వాఁడు గాఁడు. అంత్యోపాయముం దక్కనన్య మీతని

యెడ నుపయోగ కారికాదు. తన పేరు మాత్రము చెప్పిన నంతయు సత్యము పలికిన ట్లెంచుచున్నాఁడు. రాజ్యశ్రీదేవియని చెప్పి మంగళికం దెచ్చి రాజున కర్పించి యసత్య మాడినందులకుగా శశాంక గుప్తుని చే రాజకీయ కారాగారమున నుంపఁబడి, యటనుండి తప్పి వచ్చెనని యీతని చరిత్రము మన మెఱుఁగమని యెంచియున్నాఁడు.

ఈ మాటల విని నంతన ఆ సభలోని వారెల్లరు నాశ్చర్యపరవశులైరి. చంద్ర కేతువునకును ఇది యీతని కెట్లు తెలుకవడియెనని విస్మయము జనించెను. ఇంకను దా నూర కుండిన బాగుండదని యెంచెను. నిజము చెప్ప నోరు తెఱచెను. ఇతలో నసత్య మేదేనిఁ బల్కి- ఈ యాపదనుండి తప్పుట కగునా యని యాలోచించెను. తుదకు సత్య మెఱిఁగించుట యే సరియని తలఁచెను.

చంద్ర:—అయ్యా! నా రహస్యమును మీరెట్లో కనిపెట్టి తిరి. ఇంక మీ యొద్ద దాఁపఱిక మేల? నేను శత్రు ప్రేషితుఁడనుగాను. ఈతఁడు చెప్పిన లాగునఁ జెఱ నుండి తప్పినవాఁడనే. నేనటు విడివడు నపుడు నా తోడ నల్వుర శిక్షితులఁ దప్పించితిని. వారితోడ నొకచోట కేనరిగి తల దాఁచికొన నెంచితిని. ఇట్లిచ్చటచ్చటం దిరుగుచుండ మార్గమున మీ సేనలం గంటిని. మిము సంహరించి తన్మూలమున శశాంక గుప్తుని మెప్పు వడసి యథాపూర్వముగ నా పదవులఁ బొందఁ దలఁచి తిని. దాననే నా యనుచరులతోడ మీ యొద్దం జేరి

తిని. దైవము విపరీతమగుటచే నా యాసలు వృథ యాయెను. అయినను సత్య మొక్కటి వచించెద వినుఁడు. నా బొంది నూపిరి యుండువఱకును రాజ ద్రోహిని గాఁజాలననుట మాత్రము నిశ్చయము.

భండి—ఇప్పటికైనను బుద్ధి తెచ్చికొని నీ యీ యభిప్రాయ మును మార్చికొనినచో బాగు పడెదవు.

చంద్ర:—అతని యుప్పుదిని యాతని విషయమున ద్రోహ మాచరించు నంతటి నీచుఁడఁగాను.

మంగళేశ్వరుఁడు:—ప్రాణములం దీయనెంచిన వాని రక్షింపఁ జూచు వాఁ[illegible]కఁడు. స్వల్పాపరాధములఁ గొండంత లుగా భావించి, తనకై యెదుటివాఁడు వడిన పాటుల లెక్క సేయక, అపరాధమున కంటె నధిక మగు దండన గావించు కఠినాత్ముఁ డొకఁడు. వీరిలో నెవరు గొప్పవారో, నీ వెవ్వారి నాశ్రయించుట బాగుగునో యాలోచింపుము.

కుమార:—మంగళేశ్వరుఁడాడిన చొప్పునఁ జక్కఁగ నాలో చించి కొనుము. నీ కింకను గొంతకాలము వ్యవధి నిచ్చెదము. అంతవఱకును నిర్బంధమునుండి తప్పఁ జాలవు.

అని యాతని భటుల వెంట నంపెను. పిమ్మట నెల్ల రును దమ సేనల నడిపించికొని గౌడపురాభి ముఖులైరి.



## పదునేడవ ప్రకరణము.

### గణదాసాదుల విచారణ.

---

పూర్వకాలమున విదేహ దేశమున, నగరరత్న మని ప్రసిద్ధిగాంచిన దీ కన్యాకుబ్జమే. ఇది పరమజ్ఞాని యని వాసి గాంచిన జనక మహారాజు మున్నగువారిచేఁ బరిపాలింపఁబడిన పవిత్ర క్షేత్రమని యెల్లరమెప్పును బడసియుండెను. అది వీరాతివీరులగు మహా రాజులచేఁ బరిపాలిత పూర్వమయ్యును గుప్త రాజుల యీర్ష్యా మూలమునఁ గొన్ని దినములనుండియు నరాజకమైయున్నది. మంత్రులు ఎంతయో జాగరూకత గల్గి యారయుచుండినను ప్రజలకు మాత్రము రాజు లేఁడను చింతవాయకుండెను. అమాత్యులు నిజబుద్ధి వైభవమున ఁజక్కఁగ నేలుచుండినను రంధ్రాన్వేషులగు శత్రు పక్ష చరులు కొందఱు అప్పుడప్పుడును గుట్రలు సేయుచుండిరి. రాజు మరణించిన యనంతరము రాజ్యశ్రీ దేవి గానుపింపమికిఁ బ్రజలెల్ల మిగుల వ్యసన పడుచుండిరి. ఆవలఁ గొంత కాలమునకు ఆమె రహస్యముగాఁ జెఱఁబడి యుండి యందుండి తప్పుట జనుల కెఱుకవడెను. కుట్రకుఁ గారకులగు వారిని ప్రధానులు చెఱ నునిచియుండిరి. రాజ పత్నిని వెదకుటకు మంత్రులు చారులను అచ్చటచ్చటికిని బంపియుండిరి.

అగ్నిఁ బడనున్న రాజ్యశ్రీ దేవిని హర్షవర్ధనాదులు రక్షించుటయు, వారీ రాజధానికి రానున్నదియుం దెలిసిన యమాత్యులు సంతుష్ట స్వాంతులై పట్టణ మెల్లెడల నలంకరించు లాగున నాజ్ఞ చేసిరి. వీథు లెల్లను దోరణములచేతను జలువ

పందిరులచేతను నలంకృతములై విలసిల్లుచుండెను. దేవాలయ
ములలో దేవున కభిషేకాదులు జరుగుచుండెను. బీదసాదలు
దమ కధికారివర్గమువారు చేయు నుపకృతుల కెంతియు నలరుచుం
డిరి. దేవాలయములయందలి మంగళ వాదిత్రముల మ్రోఁతలు
మిన్ను ముట్టి చెలంగుచుండెను. వేదఘోష మెల్లెడలను బర్వి
కర్ణరసాయనముగఁ దోఁచుచుండెను. రాజ బంధువులు దమ
యరాజకత దీరనున్నదిక దా యని మిక్కిలి సంతోషించి, రాజ్య
లక్ష్మియే యేతెంచ నున్నదో యనఁ దనరు రాజ్యశ్రీ దేవి
గారి రాక విని ఆనంద పరవశులై జయజయ ధ్వానములు
సేయుచుండిరి. దేవిగారును హర్షవర్ధనుఁడును రాజ మిత్రుఁ
డగు విభాకర మిత్రుఁడును ఏదారి నరుదెంచెదరో యని అన్ని
దిక్కులం బ్రతీక్షించుచుండిరి. భర్తృమరణ వ్యాకులయగు
నామె ప్రకటముగా రా నిష్టపడ లేదని హర్షవర్ధను నొద్దనుండి
వర్తమాన మరుదెంచుటచే మంత్రులు గుప్తమార్గమున వారిని
నగరు లోనికి రప్పించికొనిరి.

మఱునాఁటి యుదయమున దేవిగారు నగరులోనం జేరి
రని తెలిసినంత జనులెల్లరును విస్మితులయిరి. ఆదినమున
రాజాస్థానమున మంత్రి సామంతాదు లాసీను లయియుండిరి.
రాజసింహాసనమునఁ గీర్తిశేషుఁడగు గృహవర్మయొక్క చిత్ర
పటముంచి యుండెను. హర్షవర్ధనుఁడును విభాకర మిత్రుఁడు
నుచితాసనముల నాసీనులై యుండిరి. రాజ్యశ్రీయు మంగ
ళికయు నచ్చటికి వచ్చి యుండ లేదు. ప్రజలెల్లరును రాజుగారి
మరణమే రాణిగా రాస్థానమునకు రాకుండుటకుఁ గారణమని
తలఁచిరి. హర్షవర్ధనుఁడును మఱఁది యొక్క చిత్రపటమును

గాంచినంతనే అత్యంత విషాదాకులుఁడయ్యెను. విభాకర
మిత్రుఁడును దనచెలికాని యకాల మరణమునకుఁ జింతించి
యెట్టకేలకు ధైర్యమవలంబించెను. హర్షవర్ధనుఁడు నించుక
తెప్పిటిలి కుట్రలోఁ జేరిన బంధితుల నచ్చటికి రప్పింప నాజ్ఞచే
సెను. మంత్రులును భటుల మూలమున వారిని రప్పించి హర్ష
వర్ధను నెగుర నిలిపిరి. బంధన శాలాధికారియగు గణదాసుఁ
డును, ఆరక్షక భటాధికారియగు పాంచాలుఁడును, పుర
పాలక సంఘాధ్యక్షుఁడగు మిత్రగుప్తుఁడును, మండలాక్ష పటలి
కుఁడగు గంభీరవేదియు ఖడ్గహస్తులగు రాజభటులచేఁ బరీతులై
యచ్చట నిలిచి యుండిరి. పాంచాలాదులు వ్యసనమున నున్న
లాగున గోచరించుచుండిరి. సిగ్గుచేఁ దలల వంచికొని యుండిరి.
గణదాసుఁడు మాత్రము ధైర్యము వీడకుండినట్లు గానఁబడు
చుండెను. హర్షవర్ధను ననుమతినిఁ బ్రధానామాత్యుఁడు
వారి యపరాధముల విచారింప మొదలిడెను.

ప్రధానామాత్యుఁడు:—గణదాసాదులార! మీరు రాజ
కీయ విషయమునఁ గుట్రలు పన్నుచుండిన లాగునఁ
దెలియ వచ్చెడిని. మీరే సత్యము వచియించినచో
క్రమ శిక్షయగును. లేకున్న దండన యతిశయించును.

గణదాసుఁడు:—అమాత్యవర్యా! మాపైనారోపించిన యీ
నేరము సరియగు నదికాదు. మేము రాజకీయ విష
యమున నెట్టి కుట్రలును జేయలేదు. మా రాజగు
గృహవర్మగారి విషయమున మే మత్యంతము భక్తి
గల వారమనుట లోకమున కెల్లను విదిత మగునదియే.

ప్రధానామాత్యుఁడు:—రాజు మరణింపఁగనే దేవిగారిని నీవు చెఱనిడి యుండలేదా ?

గణదాసుఁడు:—నేనామెం జెఱ నుంచినది యథార్థమే.

ప్రధానామాత్యుఁడు:—అది యపరాధ మగునుగదా ?

గణదాసుఁడు:—రాజుగారు మరణించిన పిదప లబ్ధవిజయుఁడగు మాళవ నాథుడేఁ మనకు రాజాయెను. అట్టి యెడ నాతని మాట దాఁటుట రాజద్రోహమగును.

ప్రధానామాత్యుఁడు:—క్రమ యుద్ధ మొనర్చినవాఁడుగదా విజయి యగును! కపటమున మనరాజును సంహరించిన ఆ నీచుఁడెట్లు విజయము గాంచెనని యెంచితివి ?

గణదాసుఁడు:—కపట మించుకేని లేక ఏ యుద్ధమునను జయము గలుగఁ జాలదు. అప్పటి నా యభిప్రాయము ననుసరించి ఆతఁడు విజయియే యగును.

ప్రధానామాత్యుఁడు:—మీరా యటవీ మధ్యమున నాచరించిన రహస్యాలోచనము కుట్రలోఁ జేరినదికదా!

గణదాసుఁడు:—అది యపరాధమునఁ జేరఁజాలదు. నాయధీనమున నుండు వస్తువు అన్యునకు విక్రయింప నెంచుట దోషమెట్లగును ?

ప్రధానామాత్యుఁడు:—రాజకీయ కారా గారమున నున్న వారు నీ యధీనమైన వారని యెట్లు తలఁచితివి ?

గణదాసుఁడు:—మాళవనాథుని మరణానంతరము రాజ్యవర్ధనుఁడు రాజాయెను. ఆతని శశాంక గుప్తుఁడు వంచనచేఁ జంపెను. అంత మనదేశ మరాజక మయ్యెను. అట్టి యెడ నెవని యధీనమున నుండు దానికి వాఁడే

యధికారియగును. ఈ కారణమున నా తలంచినది పొరబాటు కానేరదు.

హర్ష:—అట్లుండినచో అస్మన్ముద్రాంకితమగు నా కల్పిత లేఖను రావింపనేల?

గణదాసుడు:—నా యనుచరులు సంశయింప కుండుటకై ఆలాగున నాచరించితిని కాని మీ కది యెట్లు తెలిసెను?

హర్ష:—లేఖావహులగు నిర్వుర సంభాషణము వినిన యొక్కరుడు మంగళికా మూలమున నా సోదరి యాపదఁ దప్పించి యీ వివరముల నంతయును నాకెఱింగించెను.

జయచంద్రుడు:—నా దుర్బుద్ధి పాయుటకు అతడే పరమాచార్యుడు. అతని యూరును పేరును వినఁగోరెద. దయ తలఁచి, ఆ మహానుభావుం జూపిన వానికి నమస్కార మొనర్చి నాయాచరించిన పాపములనుండి యుత్తీర్ణుడ నయ్యెదను.

హర్ష:—అతఁడిప్పుడు భండితోడ యుద్ధమున కరిగియున్నాడు. అతఁ డుజ్జయినీనగరవాసి. గాలవుఁడని యాతని నామము.

ప్రధానామాత్యుడు:—జయచంద్రా! నీకాతఁడు పరమాచార్యుఁ డేలాగున నగును?

జయచంద్రుడు:—నేనే యా లేఖావహులలో నొక్కరుఁడను. అతఁ డాలాగున దేవిగారిం దప్పింపకున్న శశాంకగుప్తు నొద్ద, నామెం జేర్చియుం

దును. అంత వంగదేశాధీశుఁడు నాపై నాగ్రహింపకుండు. అప్పుడు నాకుఁ గారాగృహ ప్రాప్తి యుండదు. మరల మరల నే నిట్టి యకార్యములనే యాచరించి పెక్కు పాపముల సంపాదించికొని యుందును. అట్టి కష్టములెల్లను ఆమహానుభావుని సత్కార్యాచరణ మూలమునఁ గదా నాకుఁ దప్పెను. మఱియు నీతఁ డామెం దప్పించుటచేఁగదా మంగళిక కేను బరిచిత పూర్వుఁడ నైతిని. తన్మూలమునఁ గదా నే దేవిగారి నపహరింప నెంచినపుడు వింధ్యారణ్యమున నామెచేఁ గనిపెట్టఁ బడితిని. అదికారణముగ నాదుర్బుద్ధి మానెను. కాఁబట్టి మంగళిక నాకాచార్యకయగును. గాలవుఁడు పరమాచార్యుఁడునగు.

ప్రధానామాత్యుఁడు:—నీ వొనర్చినది చెడ్డది యైనను మాదేవిగారు చెఱనుండి విడివడుటకు నీవు కారకుఁడ వగుటచే స్తవనీయుఁడ వగుదువు.

జయ చంద్రుఁడు:—నే నామె యెడఁబెక్కు తప్పులు గావించిన వాఁడను. స్తుతికి ననర్హుఁడను. స్వార్థపరుఁడనై ఆమెను శశాంకగుప్తున కధీనము గావింప నెంచిన పాపిని. కావుననే యంధకార గుహావాస శిక్షను ఈశ్వరుఁడు నాకు విధించెను. అంతటనైన బుద్ధి తెచ్చికొనక అచ్చటి నుండి తప్పిన పిదపఁగూడ నీమెను ఆ నీచు నధీనము సేయ నెంచిన నీచుఁడను. నే నొనర్చిన యపరాధములకు నను జిత్రవధ గావించినను జాలదు. అట్లుండ నీ హర్షవర్ధన చక్రవర్తి దయార్ద్రహృద

యుఁ డగుటచే నను మన్నించెను. అభిమానించి తన యాప్తవర్గమున నన్నొకనిఁ గావించికొనియెను.

విభాకర:—పశ్చాత్తాపము గల్గినంతనే ప్రాఁత పాపములడఁగిన వగు. దాన నీ వెంతయుఁ గొనియాడఁ దగిన వాఁడ వేయగుదువు.

ప్రధానామాత్యుఁడు:—గణదాసాదులార! మీ యొనర్చిన వ్రాతయును అపరాధములే యగుచున్నవి. రాజుగారు మరణింపఁగనే ఈ రాజ్యము రాణిగారి యధీన మాయెను. కావున నామెను జెఱనుంచుట రాజద్రోహమే యగును. ఆమె నన్యున కర్పింపఁ జూచుట అంతకంటెను శతగుణాధికంబగు నపరాధ మగుచున్నది. కాఁబట్టి మిమ్ము దండింపఁ బోవుచున్నాను.

గణదాసుఁడు:—రాజాభిమానులమగు మమ్ము రాజద్రోహులని మీ రెంచుట సరికాదు. దండ్యాదండ్య విచారము సేయఁదగు మీరలే కఠినశిక్ష విధింప నెంచిన మిమ్మెదిరించు వారెవ్వరు? తల్లియే విషము పెట్టఁదలఁచిన నింక రక్షకు లేరుందురు? అది యకార్యమని తోఁచినచో మే మేల యాచరించి యుందుము. మా యప్పటి యధ్యవసాయము గుర్తింపక మీ రీలాగున నెంచుట న్యాయమగునా? ఇచ్చటి వారెల్లరును మీక నుకూలురే యగుదురు. ఇంక మా మాట లాలకింపు వా రెవరు? మీ యిష్టము చొప్పున జరిపి కొనుఁడు.

విభాకర:—అమాత్యా! ఏ విషయమునను తొందరపాటు పనికి రాదు. చక్కఁగ నారసియే సర్వమును జేయనగును.

ప్రధానామాత్యుఁడు:—అట్లయిన మీరేమి సేయుమనెదరు?

విభాకర:—ఏ రాణి నాచరించినది దోషయుక్తమే యయినను వీరియధ్యవసాయము చొప్పున నది పాపము కానేరదు. కీరాదిం బడిన యభిప్రాయము పొరబాటగునది. కావున దాని మార్చికొని దేవిగారి యెడల భక్తిం జాటించినచోఁ జాలును. అట్లయినచో వీరిని దడింపక యూరక విడువవచ్చును. ఇది నాకుఁ దోఁచిన తెఱఁగు. ఇంతకును హర్షవర్ధన మహారాజు నభిమతము భంగి నాచరించుటయే యుక్తము.

హర్ష:—మీరాడినదియే నాకు నభిమతమగుచున్నది.

గణదాసుఁడు:—ఇంక మే మెప్పుడును ఇట్టి యకార్యముల నాచరింపము.

గంభీరవేది:—నా జీవిత కాలము లోపల నెప్పుడును రాజద్రోహమను మాటయే తలపెట్టను.

మిత్రగుప్తుఁడు:—మన రాణిగారి యెడల నెప్పుడును సదభిప్రాయమే కలిగి యుండెదను.

పాంచాలుఁడు:—రాజభక్తి నెన్నఁడును విడనాడను.

అంత హర్షవర్ధను ననుమతి నమాత్యుఁడు వారి విడచి పుచ్చెను. ఆవల సభ చాలించి యెల్లరును వారి వారి యునికి పట్ల కరిగిరి.



## పదు నెనిమిదవ ప్రకరణము.

### భిన్నాభిప్రాయములు

"ఆహా! ఈ దినమే సుదినము! మా స్వామి మరణించు టచేతఁ గలిగిన పరితాపము ఈ శుభ వీక్షణమున నించుక యుపశమించుఁగాక. రాజ్యశ్రీ దేవిగారిపై నీ రాజ్యభార ముంచిన నాభారము తీరినట్లగును. వర్షము రాకకై యెదురు చూచుచుండిన చాతకము తీరున ఇన్నిదినముల నుండియు నేరి యాగమనమునకై నిరీక్షించుచుంటినో యాదేవిగారు ఇప్పుడరు దెంచి నందులకు నాయంతరంగము సంతస మందుచున్నది. దేవిగారు రాజ్యము పరిపాలించెదరు కదా యను నానంద మిప్పు డభివృద్ధమైనను ఆమె యనంతర మీ రాజ్యమున కెవ్వరు రాజగుట యనుచింత యొక వైపునఁ బొడము చున్నది. ఎంత ధనముండినదేమి? ఎందఱు బంధువులుండిననేమి? సంతతి హీనులగతి నిహీనమయగు! ఔరా! మౌఖరీవంశజులగు వారి సంతతి యంత మందెనుగదా! బీదలు కాపాడ లేక విసిగి కొనుచుండినను, ఈశ్వరుఁడు వారికి బిడ్డలఁ బెక్కుర నొసఁగును. సంపదచే నిండియుఁ దమ యనంతర మాద్రవ్యము ననుభవించుటకుఁ గుమారుఁడు లేకుండెఁగదాయని వంతనందు వారికి ఒక్కఁ కుమారునైన నీక చింతలపాలు సేయుచుండును. ఈశ్వరేచ్ఛం గడచుట కేరికిఁ దరము? అయ్యది చేతితోఁ ద్రోసిపుచ్చినఁ బోవునది కాదు. ఇంతకును ఆమహాత్ముఁడు హర్షవర్ధనుఁడుండ నింక నేనేల చింతపడవలయును? విభాకర మిత్రుల యభిమతమును ఇట్లేయని తోఁచుచున్నది.

అబ్బా! ఏమి యీయామె పట్టుదల? ఎందఱెన్ని చెప్పినను నన్నిటి నీమె పెడచెవిం బెట్టుచుండెను. రాజ్యభారము వహింప నీమె నంగీకృతం గావింప నెంత కష్టపడవలసె. మూర్తిమంత మగు మా యదృష్టదేవత యరుదెంచెనో యన నా ప్రభాకర మిత్రులు వీరివెంట నిచ్చటికి వచ్చుటచే మాయాశలు వ్యర్థము గాకుండె. ఆ మహానుభావులు లేకున్న నీ కార్యము కొన సాగి యుండనేరదు. సోదరుఁడగు హర్షవర్ధన మహారాజు మూలముననుగాని పనిని ఆయతిశ్రేష్ఠులు సరివఱచిరి గదా! అట్టి మహామహుల నెంత కొనియాడినను దనివి తీరదు."

అని యొక నాఁటి యుదయమునఁ గన్యాకుబ్జమున నొక మేడపై నాసనోపవిష్టుఁడగు ప్రధానామాత్యుఁ డాలోచించుచుండెను. ఇతని చెంత మఱియొక యాసనముపై నింకొక పురుషుఁ డాసీనుఁడై యుండెను. ఈ పురుషుని మోమించుక వాడు వాఱియుండెను. ప్రధానామాత్యుఁడు నాతనిం జూచి విస్మితుఁడై ;

ప్రధానామాత్యుఁడు:—ప్రభాకరా! దేవిగారు రాజ్యపరిపాలన మొనర్ప నంగీకరించిరి. రాజ్య మరాజకముగా నుండదు. ఇట్టియెడ సంతసించుటకు మాఱు ఇట్లు వ్యసనము నందఁ గారణమేమి?

ప్రభాకరుఁడు:—విఘ్నము లెల్లం గడిచి యామె సింగపుగద్దియపై నారోహించినఁ గదా సంతసింప వలయును!

ప్రధానామాత్యుఁడు:—నీ మాట నా కాశ్చర్యము గలుగఁజేయుచున్నది. పాలించుటకు దేవిగారు నంగీకరిం

చిరి. ప్రజలు నధికారి వర్గమును ఒక్కటిగఁజేరి యీ కార్యమున కెంతయు సంతోషము పొందియున్నారు. ఇట్లుండ దీని కిరక విఘాతములు కలుగునను శంకను వీడుము.

ప్రభాకరుఁడు:—ప్రజలు నధికారి వర్గమును దేవిగారి పట్టాభిషేక సందర్భమున నేకాభిప్రాయులైనఁ గదా చింతిల కుండ వలయు. అదియే దుర్లభమని నా యాశయము.

ప్రధానామాత్యుఁడు:—ఈ విషయమునం గొంధ అతృప్తులగుదురనియా నీవు తలంచుచుంటివి ?

ప్రభాకరుఁడు:—అగును.

ప్రధానామాత్యుఁడు:—ఆ విషయముల వివరించి చెప్పుము.

ప్రభాకరుఁడు:—గణదాసునిపై గౌరవ ముంచి యుండు కొందఱాతని పక్షమును సమ్మతించిరి.

ప్రధానామాత్యుఁడు:—గణదాసుని పక్షమేమిటి?

ప్రభాకరుఁడు:—మహారాజ మరణము మొదలు ప్రజాస్వామ్యముండ వలయునని యూదుచున్న వారలు.

ప్రధానామాత్యుఁడు:—ఈ మాత్రమునకై చింతయేల ? ఆతని లోఁబఱచి కొనినచో ఆ చిక్కు వీడఁగలదు కదా!

ప్రభాకరుఁడు:—అంతియ కాదు. గంభీరవేది మున్నగువారు సంతతి హీనయగు దేవిగారి కంటెను హర్షవర్ధనునకుఁ బట్టము కట్టుట న్యాయమనుచున్నారు. కొందఱు నిరంకుశ ప్రభుత్వ ముండవలెననియుఁ గొందఱు ప్రజాప్రతినిధి సభకు లోఁబడి రాజుండ వలెననియు

నాడుచున్నారు. ఇట్లు అధికారివర్గ మంతయు భిన్నాభిప్రాయములు గలవారలగుటచే జనులును బెక్కురు పెక్కు విధములగు నభిప్రాయములం బొంది యున్నవారు.

ప్రధానామాత్యుఁడు:—శశాంక గుప్తుఁడు రాజు కావలయునని యేరునుం గోరనందున నదియే మనకు శుభసూచకము.

ప్రభాకరుఁడు:—ప్రసక్తమయిన దాని నుపశమింపం జూచుట భావ్యము, కాఁబట్టి ఇట్టివానితో తృప్తిచెందుట లాభకారి కాదు.

ప్రధానామాత్యుఁడు:—ఇట్టి చిక్కులు వేనవేలు కల్గినను వాని నతి శీఘ్రమునఁ జక్కపెట్టఁ గలను. ఇదె వారిం బిల్వనంపెదను.

అని గణదాసాదులం బిలచుటకు భటుల నంపెను. వారును శీఘ్రముననే బిలచి కొనివచ్చిరి. అమాత్యుఁడును వచ్చినవారి నాననోప విష్టులం గావించెను.

ప్రధానామాత్యుఁడు:—గణదాసా! రాణిగారి సింహాసనాసీనం జేయవలయునని నిన్న మనమెంచి యుంటిమికదా! వలయు సంభారముల నెల్ల సజ్జీకరించితివా!

గణదాసుఁడు:—దేవిగారికిం బట్టము గట్టుటకంటె ప్రజాస్వామ్యముం గల్గియుండుట మేలని నామతము.

గంభీరవేది:—శాసకుఁ డొక్కఁడు లేకుండినచోఁ బ్రజలలో శాంతి కలుగనేరదు.

పాంచాలుఁడు:—రాజునకు నిరంకుశాధికార మొసఁగినచో ప్రజలు కష్టముల పాలు గావలసివచ్చును. కావున రాజు ప్రజా ప్రతినిధి సభకు లోఁబడి యుండట మేలు.

గంభీరవేది:—ప్రజా ప్రతినిధి సభకు లోఁబడిన రాజుండు టయుఁ బ్రజా స్వామ్యము గల పాలన ముండుటయు సమములే యగును.

మిత్రగుప్తుఁడు:—ఎట్లైనను సంతాన హీనయగు మనరాణికిఁ బట్టము గట్టు టుచితము గాదని నే నెంచుచున్నాను.

పాంచాలుఁడు:—రాజ బంధువులలో నేరిదైన నామె దత్త స్వీకార మొనర్చి కొనినచో వాని రాజుం గావించి కొననగు.

గణదాసుఁడు:—భర్తయనుమతి లేనప్పు డాస్వీకారము చెల్లు టెట్లు? కావుననే ప్రజాస్వామ్య ముచిత మగునని నే నుడువు చుంటిని.

గంభీరవేది:—హర్షవర్ధనుని రాజు గావించినచో ఆ చిక్కు తీరును గదా!

పాంచాలుఁడు:—అతఁడు నిరంకుశాధికారి యగును. కావునఁ బ్రజా ప్రతినిధి సభకు లోఁబడి యుండఁజాలఁడు.

గణదాసుఁడు:—మీరేమి చెప్పినను బ్రజాస్వామ్యము నందలి సుఖము తక్కినదానఁ గల్గనేరదు.

గంభీరవేది:—మీ రెంత వాదించినను రాజు లేకుండుట యయుక్తమనియే నా విశ్వాసము.

గణదాసుఁడు:—నీమాట లెప్పటికిని వినఁదగదు. నీవౌననినఁ గాదను వాఁడవు.

పాంచాలుడు:—నీ యాలోచన చొప్పున నడచికొనినచోఁ దప్పక చెడవలసినదియే యగును:

మిత్రగుప్తుడు:—గణదాసునిమాట లెన్నటికి నంగీకార్యములు గాఁజాలవు.

గణదాసుడు:—మీ మాటల వినినవారు బాగు పడుదురని యామీ యెన్నిక!

ప్రభాకరుడు:—అయ్యలారా! పెద్దలు మీరిటు కలహాము న కుపక్రమించుట సరియగునా?

గణదాసుడు:—రాజ్యమొక్కనియధీనము గావించి మన మెల్లరము నాతని నిరంకుశాధికారమునకు లోఁబడి కష్ట మనుభవింప వలయునని యానీ యిష్టము.

ప్రభాకరుడు:—మీరిటు తగవు లాడుట మాని యొక మార్గమునకు రావలయునని యంటి నంతయే కాని వేఱు కాదు.

ప్రధానామాత్యుడు:—గణ సాదులారా! రాజు లేకుండిన రాజ్యము బాగు పడఁజాలదు. అట్లని మిమ్ము నిరంకుశాధికారము క్రిందఁ గష్ట మనుభవింపవలయునని నేఁ జెప్పుటలేదు. కేవల మస్వతంత్రుఁడై రాజు మన చేతిలో నుండుచు మన మాచరించు నక్రమము లెల్లం జూచుచుండవలయు ననియుఁ జెప్పుటలేదు. ప్రజలఁ గన్న బిడ్డలఁబోలెఁ గాపాడు రాజుండినచో ప్రజాస్వామ్యపు ఫలముచే కూఱును. ప్రజలతోఁ గలిసి యుండక పోయిన నా రాజువలన మన కేమేలును గలుగ నేరదు. కావున నాతఁడు గర్వహీనుఁడై మనతోఁ జేరియున్న,

ప్రజాప్రతినిధి సభతో నాలోచించి మన కనుకూలములగు కార్యము లొనర్చును. స్వాతంత్ర్య విహీనుఁడైన రాజు రక్షణ యోగ్యుఁడుగాఁ జాలఁడు గావున మన యోగక్షేమములకుం దగురీతి నారయఁ గల రాజుండినయెడలరాజుస్వతంత్రముగాఁ బరిపాలించుటచేఁ గలుగు ఫలమును మనకుఁ గలుగును. వీని కను గుణముగ నుండు నట్టి యాలోచనము చేయుట మన విధి. అయ్యది ఱేపు విచారింతము.

అని వారికి సమాధాన మొసఁగెను. వారును ప్రధానామాత్యుని వీడ్కొని వారి వారి యిండ్ల కరిగిరి.



## పందొమ్మిదవ ప్రకరణము.

### ఏమ్యా సూచన.

---

"ఆహా! సర్వాంగ సుందరియై, యన్వర్థాభిధానయగు నా మానిని మంగళిక యిట్టి దౌర్భాగ్యవంతునకా యబ్బెను! మామిడి మొలక నాటునపుడే పండ్లపంపకమున కుపక్రమించు వానిం బోలె నాలతాంగి యిచ్చటి కరుదెంచినంతన తనచేయిం జిక్కినటుల భావించి సాకల్ప సహస్రము లాచరించెను. వివాహితయగు కాంతనుగూడ విడనాడు నంతటి సాహసమునకును వెనుదీయని వానివలెం గాన్పించెను. తుట్టతుదకుం బిట్ట గూంటినుండి యట్టె లేచిపోయెను. సిగ్గులచేటగునని యెంచి ఆ వృత్తాంతమున నెవ్వరితోడం జెప్పక పోయినను నీతని వగపుంగని సంశయించిన కొందఱి మూలమున నిదియంత యును దెలియనాయెను. అను వ్రతయై, అతండే దైవమని భావించు కులకాంత నలక్ష్యముసేయు వానికి వగపుగాక సుఖ మెట్లుకల్గును?

జైన—నమ్మి యింటికివచ్చిన యతిథికి విసము పెట్టి చంపిన వానికి సుఖమెట్లు కలుగును? లోకపాలుర యంశను గదా నృపాలుండు జనించువాండు? అట్టివాని హింసించిన వాండు దైవవిరోధియే కాంగలండు. దైవము వ్యతిరేకించి నచో నేకార్యమును గొనసాగనేరదు. పాపము లన్నింటి లోన రాజద్రోహ మెక్కుడగునది. అట్టి మహాపాతకము నించుకేని జంకు గొంకు లేక అవలీలగ నాచరించెను. వీని రాజ్యలోభ మును స్త్రీలోలతయు నెన్ని హత్యలకు మూలమాయెను?

పరమ సాధ్వీమణియగు నా రాజ్యశ్రీ దేవిం జెఱుపం జూచెను. జయచంద్రాదు లామెం దఱిమినపు డాబిడ యెంతవగచెనో! పతివ్రతకంట నొక్క యశ్రుకణము రాలిననే కుల నాశన మగును. అట్లుండ నామెపడిన వ్యసన మీతని నూరకవీడునా? దాని ఫల మవశ్య మనుభవింప వలసినదియే. '

కుక్క యెంగిలి దినవలయు నన్న నయ్యదియు దుర్లభ మైనటుల, రాజ్యశ్రీ 'లభింపకున్న నామె దాసి యయినం జిక్కినం జాలునని యెంచిన నాబిడయుం జేయి దప్పెను. నీచ కార్యము లాచరించువాని కీశ్వరుం డిట్లే శిక్ష యొసంగును. దేవిగారు నెన్నియో తడవ లిట్టియకార్యము లాచరించుట క్షేమావహము గాదని మందలించియును ఆమె మాటలం బెడ చెవిం బెట్టెను. ఇంక మూర్ఖుని ఛందాను రోధమున వశపఱచి కొనుట యుక్తమని యెంచి యామెయు నీతని యకృత్యముల కే ప్రతిషేధమును గావింపకున్నది. ఆలాగున నుండు కొలందియు నాతని దుశ్చర్యలు అధికములగుచున్నవే కాని తగ్గుట లేదు. నీచ కార్యము లాచరించు నీతనికి భార్యయగుటచే నెట్టి వ్యసనము పాలు గావలసియుండునోయని నిన్న 'వ్యసన పడుచు నామె కంటం దడిపెట్టి కొనియుండుట చూచియుం గూడనీవాని పగిది నటించి యంతిపురినుండి యాతండు వెడలిపోయెను.

అమాయిక యగు మా దేవియు నొక్కొక తఱి నాతండు గపట స్నేహము నెఱప నరుదెంచిన నాతని వంచనం దెలియలేక విశ్వసించుచున్నది. దాననే కదా మంగళికయుండిన యా కర్పూరసౌధమునకుం దన భర్తయొక్క మోహము నెఱుక పఱుప నర్ధరాత్రమున దూతికయై అరుగు లాగున

నాయెను. దాసియైనను నామంగళిక ఈమెకుందగు బుద్ధులఁ జెప్పి పంపెను. ఎవ్వరెంత చెప్పిన నేమిఫలము! మరల నాతఁడు హాసన్ముఖుఁడై యెదుర నిలచినంతనే అన్నియు మఱచును. ఆదినుండియును ఇట్టి నీచవర్తనుని బెదరునఁ దన యధీనము గావించికొనక సరళ హృదయయై ఆతని యిష్టము చొప్పునఁ బోవుచుండుటచేఁ గదా ఇన్ని కష్టములు కలిగెను! మించిన దానికి వగవఁ బనిలేదు. ఇంకనైనఁ ద్వారికిఁదెచ్చికొను విధ మారయుమని నా బోంట్లు నుడివిన భర్త యిష్టమున కన్యథా నటించుట పతివ్రతలకు భావ్యము కాదని వచించును."

అని యిట్లు లోకనాఁటి సాయం సమయమున వంగ దేశాధిపు నంతఃపుర పరిచారిక యొక్కతె తలపోయుచు నంతి పురిలోన నుండు రాణి యెదుట నిలచియుండెను. అంతకుఁ గొంత మున్ను శశాంక గుప్తుఁడచ్చటికివచ్చి మిక్కిలి మక్కువ గల వానివలె నిచ్చకము లాడి వెడలియుండెను. తన్మూలమున సాధు శీలయగు నామె యెంతయు నలరుచుండెను. ముఖమును మిక్కిలి వికాసము గల్గియుండెను. ఆమె తన యెదుట నిలువఁ బడియుండు నా పరిచారికం గాంచి యిట్లనెను.

రాణి:—చెలీ! నేఁటి నీ మోముతీరు చూడఁ గ్రాంతి దక్కి యున్నది. కారణమేమియో తెలుపుము.

పరిచారిక:—అమ్మా! హర్షవర్ధనుని సేనలు మన నగరమును ముట్టడింప వచ్చుచున్నవఁట. కుమారుని సేనలును భిల్ల సైన్యమును వానికిఁ దోడ్పడియున్నవఁట.

రాణి:—ఈవిషయము నీ వెట్లుఁగఁ గల్గితివి?

పరిచారిక:—మన పురమున నెల్లెడల నిదేవార్త వినవచ్చుచున్నది.

రాణి:—రాజుగారెంతకును నిచ్చటికివచ్చి యుండ నీ వృత్తాంతము తెలుపరైరి. కారణమేమియో తెలియరాదు.

పరిచారిక:—దేవిగారచ్చట భీతిలెదరో యని చెప్పియుండరని భావించెదను.

రాణి:—మన సేనాపతి భీమ సింహుఁడుండ మన నగరమన్యుల చేతిలోఁ బడ నేరదని నే నెంచెదను.

పరిచారిక:—దేవీ! సేనాపతియు నూరలేఁడఁట. ఇంక నెట్లుకానున్నదియో యెఱుఁగను!

రాణి:— సేనాపతి యూరలేక యెచ్చటికి నెళ్లెను?

పరిచారిక:—రాజుగారే యాతని నెచ్చటికో యంపిరఁట.

రాణి:—అట్లైన మనకు జయము గలుగుట సంశయమే యని యెంచెదను.

పరిచారిక:—దైవ మనుగ్రహించిన జయము గలుగుటకు లోపముండదు.

రాణి:—దైవమునకే యనుగ్రహ ముండిన సేనాపతి నిట్టి సమయమున నూరనుంచక తఱుమునే!

పరిచారిక:—మనకు జయము గలుగ వచ్చు ననుటకుఁ గొన్ని కారణములు గలవు.

రాణి:—వాని వివరింపుము.

పరిచారిక:—భిల్ల సైన్యములు నాగరక శూన్యములు. కుమారుని సేనలును హర్షుని సేనలును నూతన స్థలమునకు

వచ్చుటచే నంత తీవ్రముగ యుద్ధమాచరింపఁ జాలవు. కావున మనకు జయము గలుగవచ్చునని తలఁచెదను.

రాణి:—ఎట్లైనను మన సేనల నడపు వారొక్కరుండవలదా! ఇప్పటి మన రాజుగారి హితులెల్లరును భోగలాలసులే కాని యొక్కరైనను యుద్ధమున నిలువఁదగినవారు గార నియే నేనెంచెదను. ఇంక రాజుగారు తామే నడపి నచో నేమో చెప్పఁజాలను.

పరిచారిక:—రాజుగారప్రమత్తులై యుండినఁగదా సేనల నడపఁ గలుగుట!

రాణి:—అట్లేల యనెదవు?

పరిచారిక:—మంగళిక చెఱనుండి తప్పినది మొదలు వారి చిత్తమొక్క తీరున మాఱియున్నది. దాననట్లాడవలసె.

రాణి:—ఆమె చెఱనుండి తప్పెనా? రాజుగారీవిషయము నాకేల తెల్పలేదు.

పరిచారిక:—చెప్పిన సిగ్గులచేటగునని మౌన మవలంబించిరి.

రాణి:—రాజుగారియెడ నించుకేని గౌరవ ముంపక ఇట్లు చులకనగా నాడుట నీకు సరికాదు.

పరిచారిక:—దేవి! క్షమింపుము. ఏది యెట్లున్నను రాజుగారి మన సిప్పుడ న్యాయత్తముగా నున్నది. కావున సేనలు నడపుటకు వారి కిప్పుడు సాధ్యమగునదికాదు. ఇంత కును గానున్నది కాక మానదు. అందులకై చింతిం చిన నేమి ఫలము? ఈశ్వరాజ్ఞలేని దేదియు జరుగఁ జాలదు. కాఁబట్టి దైవముపై భారము వైచియుండుట భావ్యము. పౌరుషము ముఖ్యముకాదు. దైవబలము

లేకున్నఁ బురుష ప్రయత్నమెంత యున్నను నేమి యుప
యోగము? అతనిఁగాదని యణువైనం గదల దనుట
సత్యము. కాఁబట్టి యిప్పటి యీ చింతలమాని దైవ
చింత చేయుచుండిన మేలగును. అతఁ డనుగ్రహించిన
బ్రహ్మాండము నెల్లఁ దృణముగాను, తూలరాసుల నెల్ల
గొప్ప కొండలపిండుగాను జేయఁగలఁడు.

రాణి:—అట్లైన నే నిప్పట్టున నగ్నిగృహమున కరిగి దేవ
పూజలఁ గావింతును. నీవును పూజా ద్రవ్యములం
గైకొని నా వెంటరమ్ము.

పరిచారిక:—అట్లే కానిమ్ము.

అని యందుండి వెడలి పూజాద్రవ్యములం గొనివచ్చెను. రాణి స్నానముచేసి శుచియై యగ్ని గృహమున కేఁగెను. అచ్చట దేవ పూజ సలిపి దైవమును ధ్యానముచేయుచు నిమీలిత నేత్రయై నిలువఁబడియుండెను. శశాంకగుప్తుఁడు నంతఃపురమున కరుదెంచెను. అచ్చట రాణిఁగానక పరిచారికల మూలమున నగ్ని గృహముననుండుట తెలిసి యచ్చటికి వచ్చెను. కన్నులు మూసికొని యట్లు దైవమును ధ్యానించు నామెం జూచి విస్మితుఁడాయెను. పరిచారిక నందులకుఁ గారణ మడుగఁ దలఁచెను గాని ఎచ్చట నామె ధ్యానమునకు భంగము కల్గెడినో యని యూరకుండెను. రాణియుఁ దన చిత్తమును ఆభగవంతుని యందు లయింపఁజేసియుండ నామె మది కీవిధమునఁ బొడఁగట్టెను.

ఎదుట నగ్ని గుండము. తన్మధ్యమునఁ గనక సింహాసనము. సింహ పీఠికా మధ్యమున సహస్రార యుక్తమై జ్వలిం

చుచుండు నొక చక్రము. చక్ర మధ్యమున మెఱయుచుండు రత్న కిరీటమునుగల యొక దివ్య పురుషుఁడు. అతని రెండు హస్తముల రెండు బంగరు గిన్నియలు. అందొక దానఁ బలు వన్నెల పూవులును వేఱొక దాన జ్వాలలు పైకెగయు నగ్ని యునుండెను. అతఁడట్లె నవ్వుచు నెదుర వచ్చుచుండెను.

ఇంతలోన నాతఁ డదృశ్యుఁడయ్యెను. ఇప్పుడా స్థల మొక యంధకార బంధురమగు గుహా మధ్యము. అందొక మూల శశాంక గుప్తుఁడు భయ కంపితుఁడై యుండె. రాజ్య వర్ధనుఁడు ఖడ్గపాణియై వానిం జపవచ్చుచుండెను. వాని యాకారముంజూడ నతి భయంకరముగ నుండెను. అట్లు వచ్చునా రాజ్యవర్ధనుఁడు శశాంక గుప్తుని కంఠమును గత్తితో నఱుకు ట కుపక్రమించుచుండ వా రిరువురు నదృశ్యులయిరి.

ఇప్పుడది గుహామధ్యముగాఁ దోఁచక పూర్వమువలె నగ్ని గృహముగా నుండెను. మున్నుఁబోలె నగ్ని గుండమున సింహ పీఠికపై సహస్రార చక్ర మధ్యమున దివ్య పురుషుఁ డుండెను. పూర్వమునవలె నాతనిచేత బంగరు గిన్నె లేకుండెను. ఒక్కచేత నెత్తుటఁ దోఁగియున్న శశాంక గుప్తుని శిరము నింకొకచేత వాని మొండెమును గోచరించుచుండెను. అంత నా సాధ్వీమణియు భీతయై యిట్లు విలపింపసాగెను.

"హా! నాథా! మీరే గతియని నమ్మియుండు నన్ను వీడిపోవు టుచితమే! అయ్యో! రక్తసిక్తమగు మీ యాఖండిత శిరమును జూచి నేనెట్లోర్వఁగలను. నాఁడు నా వాక్యము లాల కించినచో నిట్టి దుర్గతి పట్టియుండదుగదా! ఓ యజ్ఞ పురుషా! ఇంతకు మున్ను నవ్వు మోమునఁ గాన్పించినవాఁడ వింతలోన

నక్కాటిక మింతయైన లేక యిట్లు చేయనగునే! నా నాథుని శిరమును దేహముతోడ నతికించి పునర్జీవితునిగాఁ జేయుము. లేకున్న నన్నైనను సంహరింపుము."

ఈ మాటలాలకించిన శశాంకగుప్తుఁడు విస్మితుఁడగుచు;

"కాంతా! నేఁడేల యిట్లు భ్రమించుచున్న దానవు! నే నిదె నీ యెదుట నున్నవాఁడను, ప్రేయసీ! కనులు విచ్చి చూడుము."

అని యిట్లు భర్త వాక్యములు చెవి సోఁకినంత మీలిత నేత్రయై యెట్ట యెదుట నాతనిఁ గాంచెను. మొట్టమొదట సంశయించెను! ఆవలఁ దన శరీరము దాఁకి చూచికొనియెను. తానప్పుడు నిద్రావస్థయందు లేదని దృఢముగ నెంచెను. కన్నులు మూసికొనెను. పూర్వమువలె సహస్రార చక్రాదులు గాన్పించకుండెను. అంత మరలఁ గన్నులు విప్పిచూచెను. యథా పూర్వముగ భర్త యగుపడుచుండెను. అంతఁ దానింతకు మున్నుఁ గాంచిన దంతయును భ్రాంతిమూలమగున దని యెంచెను. భర్త సుఖియై యుండుట కెంతయు సంతసించెను. శశాంక గుప్తుఁడు నామె నోదార్చి యంతి పురమునకుఁ బిలిచికొని వచ్చెను. సఖీజనము లనేక విధముల శైత్యోపచారములు చేయుచుండిరి. ఈ విధముగ నా రేయి యెల్లం గడచెను.

# ఇరువదవ ప్రకరణము.

## వింతబాబు.

ఒకనాఁటి యుదయమున స్థానేశ్వరమున నల్లకల్లోలముగ నుండెను. ఆకులురగుచు రాజభటులు వీథుల వెంట వేవేగఁ బర్వులిడుచుండిరి. ఆరక్షక భటు లచ్చటచ్చట నిలచి నిజభటుల కేమియో యాజ్ఞాపించుచుండిరి. అధికారి వర్గమునఁ జేరినవా రనేకులు గుస గుస లాడికొనఁ జొచ్చిరి. ప్రజలనేకులు నిదమిత్థమ్మని తెలియ నందునఁ గలవర పడసాగిరి. కొందఱు సందు గొందుల నిలచి యీ గందర గోళమునకుఁ గారణ మూరయుచుండిరి. కర్ణాకర్ణికగాఁ గొంతవఱ కావృత్తాంతము తెలిసినవారు చెఱసాల యొద్ద కరుగుదెంచిరి. ఒకరి వెంబడి నొకరుగ క్షణములోన నా ప్రదేశమెల్ల నిండెను. వచ్చిన వారిలో వృత్తాంత మెఱిఁగినవారు గొందఱును, పోవు వారిం జూచి విషయ మిదియని తెలియకున్నను వెంబడించు వారు గొందఱుగను నుండిరి. ఇసుము సల్లినను రాలనంతటి జనాక్రాంతమగు నా ప్రదేశమున వేత్రహస్తులగు రాజభటులు ప్రజలఁ జిందర వందరలై చెదరిపోవునట్లు బెదరింపు చుండిరి. జనుల యుత్కంఠాతిశయము భటుల తర్జనముల లెక్క సేయకుండెను. బహు ప్రయత్నమున నటమూఁగి యున్న మూఁకను రాజభటు లొక యోరన నిలుపఁజాలిరి. అంత నమాత్యుఁడు కారాగారాధిపతి నిట్లు విచారింపఁ దొడఁగెను.

మంత్రి:—కరభకా! ఈ చెఱయందుండిన భీమ సింహాదు లెటకుఁ బోయిరి?

కరభ:—అమాత్య శేఖరా! నే నెఱుఁగ నప్పు డెటు బోయిరని తెలుపఁ జాలుదు?

మంత్రి:—నీ యెఱుక లేనిదే ఇదిజరిగెననుట యెట్లు సంగత మగును?

కరభ:—బంధితులు తప్పుట నే నెఱుఁగననుట సత్యము. అయినను నా యూచరించిన తొందరపాటొండుగలదు. దానిం జెప్పెదను.

మంత్రి:—అది యెట్టిది?

కరభ:—నిన్న మాయింటికొక్క యువకుఁ డరుదెంచియుండెను. అతఁడు కుమార రాజుగారి కంతరంగ మిత్రుఁడఁట. వాఁడు వారి సంతకముతో నొక లేఖం దెచ్చెను. దాన నాతని విశ్వసించి నాయింటం జేర్చి కొంటిని. నిన్న రేయి నాతఁడు ఈ యూరం గల విశేషము లడుగఁ జొచ్చెను. చెఱసాలం గుఱించి చెప్పునప్పుడు దక్కుఁ దక్కిన సమయములం దంత యవధానముతో వినకుండెను, దాన నే నాకీ సంశయము గలిగెను.

ఈ విచారణ జరుగుచుండ గుమి గూడి వినుచుండిన జన మధ్యమునుండి యొక్క పూల చెండు మంత్రి పాదముల చెంతఁ బడెను. అయ్యది విసరి వైచిన దెవ్వరనుట తెలియ నందున మంత్రియు విస్మితుఁడై చూచుచుండెను. ప్రజలు నా పడిన వస్తువుం జూడ నొక్కరిపై నొక్కరు పడుచుండిరి. అచ్చటఁగల రాజ భటులు నెంతయో కడంగియు దాని నణఁపఁజాలకుండిరి. అప్పుడొక యువకుఁడా గుమి నడుమనుండి వచ్చుచుండెను. వచ్చు వాఁడచ్చట జనుల కోలాహల మణఁపఁ

దలంచి, హుంకరించుచు, గర్జించుచు, బెదరించుచు చుండెను.

మంత్రి:—సంవాహకా! ఏమియీ యట్టహాసము!

సంవాహ:—దేవా?, విచారణకు భంగముగ నీ జనులు కోలా హల మొనర్చుటచే దాని నణంప నీ మూంకలోసి కరిగియుంటిని. నా యీ యట్టహాసము చేతనే రాజ భటులకు నలవిగాని హీరరచ్చ యడంగెను.

కరభ:—నే నింతకు మున్ను నుడివిన యాతని మోముతీ రీతని యందుం గానుపించుచున్నది.

సంవాహ:—అట్లైన నిన్నే మజెించినవాండనేనని భావించెదవే!

మంత్రి:—ఈతండు నా సేవకుండు. రూప సామ్యమున నిట్టి భ్రాంతి నందకుము.

కరభ:—మోము జూడ యేకాక మాటల సవ్వడియు నా సంశ యమును రూఢము సేయుచున్నది.

ఇది వినిన మంత్రియు నిజ మానసమున నిట్లనివిత ర్కింపం దొడంగెను. "ఏమి యీకరభకుని యజ్ఞానము! సంవా హకునిపై నిట్టి భ్రమ నెందుచున్నాండే! తనపైం దప్పు రాకుం డుటకై యిట్టి యుక్తిం గల్పించి యుండునే! అట్లొంచుటకు నే నిప్పు డాతనిపై నెట్టి నేరమును మోపి యుండలేదు గదా! వీండు శత్రు పక్షమునం జేరి నన్ను వచింపవచ్చి యుండునే! అడుగడుగున నీతండు నిజ బాంధవులం జూడవలయునని యేం గుచున్నాండు. దాన వీనిపై నించుక సంశయము జనించు చున్నది.

ఏమి యీ వెఱ్ఱితనము! నా కెంతయు విశ్వాస పాత్రుం డగు నీ సేవకునిపై నిట్టి సంశయము నందుటయా! వీండు

నా యొద్దకు వచ్చి విశేష కాలము కానందున వీని విశ్వసింపక సందేహింపవచ్చునే! ప్రప్రథమమున నెన్నివిధముల బరీక్షించి యుంటిని. అట్లుండ నిట్లు ప్రారంభించుట యయుక్తము. బందుగులంగన నేగుచుండి నాతెట నిట్లన మానింపవచ్చునే! నేనును నా చుట్టములం జూడఁ బాలుతఁబవ లరుగుట కలదు. ఇత్యాది విస్రంభ పాత్రతకు లోటుకాదు.

అట్లయినఁ గరభకుని మాట లసత్యమని తలఁతునే! అతఁడిన్నటికి ననాలోచితముగ నాడు వాఁడుగాఁడు. దీన నెద్దియో యొక విషయమున్నట్లు గోచరించుచున్నది. నిన్నటి నుండియు నీతఁడు కొంత కాలము నా యొద్దనుండినఁ దక్కినపు డెల్ల నెచ్చటనో యుండెడివాఁడు. అట్టి తరుణమున నీవంచన మాచరించియుండుననియే తలఁచెదను. మఱియు నీతఁడు స్నాన పానాదులల్లోఁ గలసిమెలసి యుండక పోవుటయు నీతనియందలి సందేహమును బలపఱచుచున్నది.

ఆహా! ఈ దిన మేనేల యిట్టి భ్రమ నొందుచున్నాఁడను? నమ్మిన బంటుపై నేరము మోపఁ జూచుచున్నవాఁడ. అట్లని కరభకునిపై నసత్యదోష మారోపించుటయా! ఇది దోషారోపణ మెట్లగును? మర్మజ్ఞుఁ డెవ్వఁడే నాతని వంచించిన భ్రమించి యిట్లాడియుండును. ఈ మాత్రమున కీతని యందు దోషము నెట్లారోపించుట?

ఆ తరుణమున సంవాహకుఁడు నా క్రిందిపూలచెండుం దీసి;

సంవాహ:—ఆహా! ఈ చెండెంతపరిమళించుచున్నది? ఇదియే మహానుభావుఁడు విసరివైచెనో తెలియరాకున్నది. ఆతఁడు మంత్రి శేఖరుని పాదపూజ గావింపవెంచి

జనులు నిబిడముగానుంట నా పని సాగమి నిట్లు విసరి
వైచి యుండనోపు.

ఈ మాటలాలించిన మంత్రియుఁ దన వితర్కములు
చాలించి యా చెండు వైపునకు మోము త్రిప్పెను. ఇంగి
తజ్ఞుఁడగు సంవాహకుఁడు నా చెండును మంత్రిచేతి కిచ్చెను.
అయ్యది నలిగియుండుటచే సడలియుండెను. తన్మధ్యమునం గమ్మ
యొక్కండు న్నట్లు గోచరించుడు దాని విప్పి యా లేఖం
గాని సంవాహకు నెద్ద నిచ్చి చదువమనెను. మంత్రి యను
మతి నాతఁ డిట్లు చదువఁ దొడఁగెను.

అయ్యా! నా యునికి మనుకులు మీరు విచారింపఁ బ్రయత్నిం
చుట వ్యర్థము. నేనే మీ కారాగారములోని బంధితుల విడు
దలకుఁ గారకుఁడను. వారు నిప్పుడు మనపక్షము వారలే.
నేనుమ మీ మిత్ర పక్షమునం జేరినవాఁడనే. మీ యెఱుక
పైనన ఈ విడుదల చేసి యుండవచ్చునుగాని నా చాపల
మట్లొనర్పకుండం జేసెను. దాన నా యీ యపరాధమును
క్షమింప వేఁడువాఁడను మే మెల్లరమును మీ రాజ్యమునకు
మేలు చేయనెంచు వారమ కాని యన్యులముకాము. ఇందు
కరభకున కించుకయు సంబంధము లేదు. ఇట్లు మీ భృత్యుఁడు.

ఈ జాబుం జదివినంతన యందఱును విస్మితుఁ లయ్యిరి;
మంత్రియుఁ గరభకునిపై నపరాధము లేనట్లు విస్పష్టమగుటచే
తను, సంవాహకునిపై సంశయమే లేనందునను ఆ విచారణ
నుపసంహరించెను. పత్రికా మూలమున బంధితులును, బంధ
విముక్తిం గావించినవాఁడును ననుకూలురగు నటులఁ దెలియ
వచ్చుటచే నొక విధమున సంతృప్తుఁడై నాఁటి సభ చాలించెను.

## ఇరువది యొకటవ ప్రకరణము.

### స్వప్న సందర్శనము.

---

గాడ నగరపు వెలుపటి మైదానమున నొక సేనావార ముండెను. అందుఁ గలవార లెల్లరును గాఢ నిద్రాసక్తులై యుండిరి. శిబిరములందుండు వారెల్లరును, పచ్చిక బయళ్ల గొందఱును, చెట్ల నీడలఁ గొందఱును, ప్రసుప్తులై యుండిరి. అచ్చటి శిబిరములలో నొక్కటి యత్యంత రమణీయముగ నుండెను. అయ్యది చీనాంబరములచే నలంకృతమై యుండెను. దానివాకిట నిర్వురు కావలి వారుచేత ధనుర్బాణముల ధరించి నిలువఁబడియుండిరి, నిలఁబడిన వారెంత ప్రయత్నించియు నిద్రకాఁగఁ జాలక యట్టెకునికి బడుచుండిరి. కావలి కాయుట వారి వృత్తియగుటచేఁ బాపము, వారేమి సేయఁగలరు! మేల్కొంచినపుడు మాత్రము దమ సేవావృత్తి నెంతయు దూషించికొనఁ జొచ్చిరి. ఇట్లు కునికి పడుచు మేల్కొనుచు నిద్రా జాగ్రదవస్థలమధ్య నుండి కష్టపడుచుండిరి.

గుడారము లోవైపున నొక శయ్యయుండెను. అందొక్కఁడు పరుండి కన్నులు సగముమూఁతవడ స్వప్నావస్థయందుండెను. వాని యాకారమును భూషణాదులం జూచిన నాతఁ డొక రాజనుట విస్పష్టమగుచుండెను. అతని చెంత నొక దీపస్తంభముండెను. అయ్యది మిక్కిలి వెలుఁగు నిచ్చుచుండెను. వాని యెడమ వైపున నొక బల్ల యమరియుండెను. దానిపై నొక చిన్న రత్న కంబళము పఱచియుండెను. అందొక కాచ

పాత్రలో ద్రాక్షారసము నిండి యుండెను. శయనించిన యా తఁడు మేల్కొనినపు డెల్ల నా మద్యమును ద్రావి మరల శయ్యపైఁ బరుండి యర్ధ నిద్రాపరవశుఁడై యుండెను. వాని చెంత మువ్వురు నేలపైఁ బరుండి గాఢనిద్ర ననుభవించుచుండిరి. దీప స్తంభములోని చమురయిపోవుటచే నాదీపము ప్రకాశహీనమై యుండెను. జాగ్రత్సుషుప్త్యవస్థా మధ్యగతుఁడగు నాశయ్యా గతు నెదుట నించుక దూరమున నొక యాకృతి నిలువఁబడి నట్లాతనికిఁ గోచరించెను. అయ్యది రక్తమాంసము లించుకయు నులేక శుష్కీభూతమై కేవల శల్యావశిష్టమై యుండెను. అది యంత పొడవుగాక పొట్టిదై యుండెను. చేతి వ్రేళులు లోన మాంసములేమి వట్టి తిత్తులవలెఁ దోఁచుచుండెను. అయ్యది మంద గమనమున నడచు లాగుండెను. దాని రూపు గాంచిన నొక యాఁడుదని మాత్రము దెలియనగు చుండెను. మెడయందు నులిమిన గుఱుతులు గొన్ని గోచరించు లాగుండెను. చెట్టునందలి సన్న గొమ్మలు గాలికిఁ గదలు లాగున దాని రెండు చేతులును నల్లలాడుచుండెను. అయ్యది తిన్నఁగ నడచుచుఁ దన వైపుననే వచ్చుచుండెను. అంత నీశయ్యాగతుఁడా యవస్థయందే నోరు దెఱచి యఱచుటకుఁ గడంగెను కాని నోటనుండిమాట రాకుండె. లేచి శయ్యయందుఁ గూర్చుండెను. మరలఁ బరుండెను. ఇప్పుడా విగ్రహము గోచరించుటలేదు కాని పూర్వము తనకు లోఁబడకుండుటచే మెడ నులిమి యగడ్తలోఁ బాఱవైచిన శోణావతి యను నొక యువతి జ్ఞప్తికి వచ్చెను. వెంటన యాతని యంగములు వడఁకఁజొచ్చెను. గుండియలు దట తటఁ గొట్టికొనఁ దొడఁగెను.

మరల నాతఁడు శయ్యా యాందా సీనుఁడాయెను. తనకుఁ దెలి యకయే లేచి యిటునటుఁ బచారు సేయ మొదలిడెను. యథా పూర్వముగ శయ్యాంగూర్చుండెను. కొంత వడికటఁ బరుండెను.

ఇటుల మున్నుఁ బోలె జాగ్రత్సుషుప్త్య వస్థలలో నుండు నాతని కనతి దూరమున మరల నొక విగ్రహము గోచరించెను. ఇయ్యది యించుక వాఁడు బాఱియున్నను మున్ను గోచరించిన దానివలె నుండక పొడవుగ నుండెను. శరీరము నిమ్మపండు వంటి చాయం గనరియుండెను. ఆ విగ్రహము దివ్యాంబరా భరణాలంకృతమై ప్రకాశ మానముగఁ దోఁచెను. చేత నొక ఖడ్గమును బూనియుండెను. దాని నేత్రముల నుండి యగ్ని కణము లురులునటులఁ బొడఁ గట్టుచుండెను. క్రూర దృష్టిం దన్ను దహింపనున్నదో యని యాతని మదికిఁ దోఁచెను. చేతియందలి కత్తిని జళిపించుచుండెను.

ఈ యాకృతిం గాంచి నంతనే శయ్యాగతుఁడగు నీతనికి రాజ్యవర్ధనుఁడు జ్ఞప్తికి వచ్చెను. అనాఁడాతఁడు విందునకు వచ్చినప్పుడు దా నొనర్చిన యకృత్యములు స్మరణకు వచ్చెను. ఆ విగ్రహ మట్లు తిక్రోధమునఁ దన్నుఁ జూచుచుఁ దనవైపునకే వచ్చుచున్నటుల గోచరించెను. అంత నీతఁడఱచుట కెంచెను గాని భయ భ్రాంతుఁ డగుటచే నోటి నుండి మాట రాలేదు. కాళ్లు సేతుల విలవిలఁ దన్ని కొనఁజొచ్చెను. అట్టి యవస్థ నించుక సేపుండు నపుడు, ఆ విగ్రహము పెదవులఁగదల్పుచు;

"శశాంక వర్ధనా! నన్నాశాఁ డేమఱుబాటున జంపిన ఫలము వృథగాఁ బోవునని యెంచితివే! ఇదె నేనిను నమిలి

మ్రింగివైవ వచ్చుచున్నాఁడను. ఇప్పు డెట్లు తప్పించి కొనఁ గలవు ?"

అని మాటాడినట్లు తోఁచెను. వెంటనే యీతఁడు సాహసించి మాటాడ నుపక్రమించెను గాని మాటలు తడఁబడఁ జొచ్చెను:

"ఆఁ,ఆఁ.రా..జ్య..ద్ద...చ...చ్చి...యి...చ....చ్చి.... యి."

అని యన్యుల కవ్యక్తమగు లాగునన నఁబలికెను. నేలపై నిద్రించుచుండిన యా మూవురును లేచి రాజు కలవరించుచున్నాఁడని తలఁచిరి. చెంతనుండు దీపస్తంభము నందలి వత్తి నెగసనఁ ద్రోచి అందుఁ దైలమును బోసి ప్రకాశము గల్గు లాగొనర్చిరి. రాజును దట్టిలేపిరి. అతఁడు నించుక సుషుప్తి నుండి లేచి:

"రాజ్యవర్ధనా! చచ్చితి చచ్చితి. నను గాపాడుము. నాకింకను బ్రదుక వలయునను కోర్కి గలదు. నీ విట్లు నను మ్రింగఁ జూచుట నీతికాదు."

అని మరల మాటాడక పరుండి యుండెను. చెంత నుండిన యా యంగ రక్షకులు మూవురును రాజు నతి ప్రయత్నమున మేల్కొల్పిరి. కూర్కినుండి విడివడిన యీరాజున కప్పటికిని రాజ్యవర్ధనుని ప్రేతము కంటి కెదుట నున్నట్లే కన్పట్టు చుండుటచే మరల;

"ఓయీ! నీ వేఁగుము. నీయీ ఘోరాకృతి చూడ నా కెంతయు భయము గలుగుచున్నది. నీకిదె వేయినమస్కృతు లర్పించు వాఁడను."

అని యీలాగు నవదరుచుండు శశాంక గుప్తు నతి ప్రయత్నమున లేపి కూర్చుండఁ బెట్టిరి.

“దేవా! ఇది దేవరవారి శిబిరము. మేమిదె మీయంగ రక్షకులము. మీకీ నాఁడేల యింతటి చిత్తచాంచల్యము గలెను. లెండు. లెండు. ఏదో దుస్స్వప్నము మీకు దోఁచినట్లు మేము తలఁచుచున్నాము.

పిదప రాజును మేల్కాంచి యంగ రక్షకులఁ జూచి;

శశాంక:—“రాజ్యవర్ధనుని ప్రేతము వచ్చియుండెనే! అది యెచ్చటికిఁ బోయెను?”

అంగ:—దేవర వారెద్దియో దుస్స్వప్నముంగని యిట్లు కల వరించుచున్న వారలంతయే కాని వేఱుకాదు.

శశాం:—అట్టులా! అయిన నిటకా ప్రేతము రాలేదా?

అంగ:—లేదు.

శశాం:—నే నింతకు మున్నను జూచియుంటినే?

అంగ:—అది దుస్స్వప్నము వలనఁ గల్గిన భ్రాంతి మూలము.

శశాం:—నే నిప్పుడు మేల్కాంచి యున్నాఁడనా!

అంగ:—స్వామీ! మీ రిపుడు మేలుకొనియే యున్నారు.

శశాం:—మీ కిది బాగుగఁ దెలియునా?

అంగ:—ఆహా! మా కిది చక్కఁగాఁ దెలియును.

శశాం:—వాఁడు గాక పోయినను నొక స్త్రీ వ్యక్తిని మీరి చటం జూచితిరా!

అంగ:—ఇం దెవ్వరును రాలేదు.

అంత శశాంక గుప్తునకు నించుక ధైర్యము దోఁచఁగఁ గనులు విచ్చి చుట్టునుం గలయఁ జూచి తా నింతకు మున్నుఁ

బడిన దండయు దుస్స్వప్న మూలమగుఁ గలవరమే యనుట నిర్ధారణ చేసికొని యెను.

శత్రు సైన్యము కోట వెలుపట మైదానమున నుండుట చారుల వలనం దెలిసి మఱునాఁటి యుదయమున యుద్ధమున కుపక్రమించుటకు వలయు సన్నాహములు గావించుటకుగాఁ గొందఱ సైనికుల రప్పించి కార్యాలోచన సేయుచుండెను.



# ఇరువది మూఁడవ ప్రకరణము.

## సంశయ నివారణము,

గణదాసుఁడు:—అమ్మా! మా యపరాధముల మన్నింపఁ వేఁడి కొనుచున్నారము.

రాజ్య శ్రీ:—మీవి యపరాధములలోఁ బరిగణింపఁ బడవని నాఁడే విభాకర మిత్రులాన తిచ్చిరి కదా!

గణదాసుఁడు:—అదికాదు. మరల నజ్ఞానకృతమగునది యొక యపరాధము

రాజ్య శ్రీ:—అది యెట్టిది?

గణదాసుఁడు:—మీరీ రాజ్యము పాలింపందగ రనుట.

హర్ష:—ఏకారణమున?

గణదాసుఁడు:_సంతాన హీనలగుటయే దానికి మూలకారణము.

ఈ మాట వినినంతనె రాజ్య శ్రీ యొక్క చిత్త మొక విధమగు మాఱుబాటు నొందెను. కాని దాని వెలిబుచ్చక యథాపూర్వ స్థితికి దెచ్చికొనియెను. ఇట్లే హర్షవర్ధనుని చిత్తమును మాఱుబాటు నొంద నాతఁడు నది వెలికిఁ దోఁచ నీక సరిపఱచికొని;

హర్ష:—గణదాసా? ఇంక మీ యభిమత మెట్టిది?

ప్రధానామాత్యుఁడు:—ఇంతకు మున్నువారు పడిన యభిప్రాయ భేదములం జెల్పుచున్నారు కాని వీరి యిప్పటి యభి మతముకాదు.

రాజ్య శ్రీ:—ఇప్పు డొక యభిప్రాయమును మాత్రమే కదా తెలిపితిరి? తక్కిన వెవ్వి?

ప్రధానా మాత్యుఁడు:—ప్రజా సత్తాకమగు రాజ్యము గావల యునని కొందఱును, నిరంకుశాధి కారము గల రాజుం డవలయునని కొందఱును, ప్రజాప్రతినిధి సభకు లోఁబడిన రాజుండ నగునని కొందఱును, హర్ష వర్ధన మహా రాజు రాజుగావలెనని కొందఱును, రాజకుటుంబములోని వారి నేరినైన దేవిగారు స్వీకార మొనర్చికొని వారి రాజుఁ గావింపవలెనని కొందఱును, భర్తయనుమతి లేని స్వీకారము చెల్లదని కొందఱును, ఇట్లెవరి కెట్లు దోఁచిన నట్లాడు చుండిరి.

హర్ష:—అవల నెట్లు తీర్మానము చేసిరి?

ప్రధానామాత్యుఁడు:—అంత నెల్లరం జేర్చికొని యవలోకి తేశ్వరు నాలయమున కరిగితిని. అచ్చటి దేవునిం బ్రార్థించితిని. అర్చకముఖమున నా దైనము దేవి గారిని సింహాపుగద్దియం గూర్చుండ నియోగించెను. హర్ష వర్ధన చక్రవర్తిని రాజ్యము పాలింప నానితచ్చెను. అప్పు డెల్లరును నేకగ్రీవముగ దాని నంగీకరించి నాతోఁడ నిచ్చటికి వచ్చిరి.

వీరిట మాటలాడుచుండ భండియుఁ గుమారుఁడును శబరనాయకుఁడు మున్నగువారు నటకు వచ్చిరి. వచ్చినవారును నమాత్యాదులచే యథోచితముగ సత్కరింపఁ బడిరి. అంత భండియు హర్ష వర్ధనుం జూచి యానందించుచు;

"దేవా! దేవరవారి యాజ్ఞ చొప్పున శశాంకగుప్తుని సంహరించితిని. అతని తనయుని వంగదేశాధిపతిం గావించితిని. వాని మనకు సామంతునిగా నొనర్చితిని. ఈ యుద్ధమున మంగ

శేశ్వరుఁడను నొక యువకుఁడు మన కెంతయుఁ దోడ్పడెను. ఆహా! ఆతని పరాక్రమము నేమని చెప్పఁగలుదును!

హర్ష:—ఆ యువకుఁ డిప్పు డేడ నున్నాఁడు?

అంత భండియుఁ దనపరివారమున నెల్లెడలం గలయఁ జూచెను. ఎచ్చటను నాతని పొలకువ గాన్పింపలేదు. అంత నతఁడును గుమారుఁడును అత్యంతము విస్మితులైరి. ఆసమయమున మంగళిక యచ్చటికి కరుదెంచి;

మంగళిక:—ఆర్యులార! హర్ష సమయమున మీ మానసముల నెట్టి సంశయములు నుండఁగూడదని మా దేవిగారి యాశయము. కావునఁ గొన్ని యంశముల నేనిపుడు వివరింపఁ బోవుదానను. దత్తావధానులరై యాలకింపుఁడు.

దివాకర మిత్రులవారి యాశ్రమమునుండి కన్యాకుబ్జమునకు వచ్చుచుండ భండిగారికిం దోడ్పడఁ బురుష వేషముల ధరించి దేవిగారును నేనును హర్షవర్ధన దివాకర మిత్రుల యానతివడసి యేఁగితిమి. అట చంద్రకేతునను చరులు మన యీ సేనాపతిగారిం జంపనెంచుట తెలిసి వారి నాఖడ్గమునకు బలియొనఁగితిని.

భండి:—ఆహా! నేనింతవఱకు నిది తెలియలేనైతిని. మీ సాహస మవాఙ్మానస గోచరము.

హర్ష:—తర్వాతి యుదంతముం దెల్పునది.

మంగళిక:—దేవిగారు చంద్రకేతుని బట్టి బంధించి చెఱనుంపించిరి. ఇచ్చటి ప్రజలు తమరామికి సంశయింతురని వెంటనే వారీయూరికి వచ్చిరి. నేనుమాత్ర

మటనుండి బంధితుని విచారించునపుడు వానిగుట్టు రట్టుపఱచితిని. ఇంతలోన నాసోదరి భామిని "తన భర్తయగు మలయకేతువు భీమ సింహాదులతోఁ జేరి కుట్రలు సల్పుచుండుటచే వారితోడ నీతఁడును జెఱఁ బడియె" నని వర్తమాన మంపెను. నేనును సేనాపతిని వీడ్కొని కన్యాకుబ్జమునకు వెడలు దానివలె నటించి స్థానేశ్వరమున కరిగితిని. నా యూహాబలమున వారిం దప్పించి వా రెప్పుడును శత్రుపక్షమునఁ జేఱకుండున ట్లొనర్చితిని.

హర్ష:— ఈ విషయ మమాత్యుఁడు నాకుం జెప్పెఁగాని వారెవ్వరైనదియుఁ దెలియక విస్మయము గల్గియుంటిని. సరి. ఆవలియుదంతముం జెప్పుము.

మంగళిక:— బంధితులు చెఱఁ దప్పినంతలకుగా మంత్రి కారాగారాధికారిని విచారించుచుండ ఆజనమధ్యమునుండి లేఖాయుతమగు నొక పూలచెండును విసరి వైచితిని. తన్మూలమున మంత్రికి సంశయము వీడెనుగాని పురుష వేషమున మంత్రి నాశ్రయించి యుండిన నాసోదరిని జూచి కారాగాధికారి సంశయించెను. ఆవల రూప సామ్యమే యందులకుం దగు కారణ మని యెంచెను. అంత నటనుండి వెడలి గౌడనగరమునకు వచ్చి మన వారికి యుద్ధమున సహాయముగానుండి యనంతరమున వీరితోడ నిటకు వచ్చితిని. దేవిగారి యానతిని మీ సంశయముల వారించితిని.

అంతట నెల్లరును విస్మయానంద పరవశు లైరి. మంత్రి సామంతాదులు రాజ్యశ్రీదేవిని సింహాసనోపవిష్టం గావించి పట్టాభిషేక మొనర్చిరి. హర్షవర్ధన చక్రవర్తిని భూపాలనాధికారిగ నేర్పఱచిరి. ఆ పుణ్యసమయమున వేదఘోషములు విస్తృతము లగుచుండెను. మంగళవాదిత్ర నిస్వనము లాకసము దాఁకి మాఱు పల్కుచుండెను చక్రవర్తియు నచ్చటికి వచ్చినవారి నెల్ల సర్వవిధాఁ బహూకరించెను. ఇతఁడు కవిత్వప్రియుఁ డగుటచేఁ దానును గవియగుటచే నీతనిసభం బెక్కురు కవు లెక్కుడుగ సమ్మానింపఁబడుచుండిరి. హర్షవర్ధనుఁడు నప్పుడప్పుడ నేకోత్సవములు సేయుచు బౌద్ధభిక్షువులను జైనసన్న్యాసులను బ్రాహ్మణులను సమానముగాఁ గారవించుచు రాజ్యశ్రీదేవిగారి నత్యంత సంతుష్టం గావించుచుండెను.

PRINTED AT THE ARTISAN PRESS, WALLAJAH ROAD, MADRAS.—1926.

